# మాటామంతీ

[ వ్యాససంపుటి ]

శ్రీ నార్ల వెంకటేశ్వరరావు



శారదా పబ్లికేషన్స్

4, పైక్రాఫ్ట్సు ఫస్ట్ స్ట్రీట్

రాయపేట :: మద్రాసు 14

10

తమ్ముని వంటి

చిరంజీవి కానూరి

వెంకటరత్నానికి



D

# వ్యాసానుక్రమణిక





చేర్పులు, మార్పులు విశేషంగా జరగడంతో కొత్తకూర్పుగా పరిణమించిన ఈ వ్యాసాలు తమ తొలిరూపంలో "ఆంధ్రప్రభ", "ఆంధ్రజ్యోతి" పత్రికలలో వెలువడినవి. ఆ పత్రికాధిపతులకు

కృతజ్ఞుడను — రచయిత



# సొంతపుస్తకం

పుస్తకాలు కొనడమంటే నాకు చెడ్డ సరదా. జేబులో డబ్బున్నా, లేకపోయినా, మంచి పుస్తకం కంటబడగానే బేరం చేస్తాను. అది పదేపదే పనిపడగల పుస్తకం కావచ్చు. ఒకసారి చదివినతర్వాత మరి పనికిరానిది కావచ్చు. అయినా దాన్ని కొనేదాకా మనస్సు రెపరెపలాడుతుంది. అప్పుచేసి కూడా పుస్తకాలు కొనడం అనేకసార్లు సంభవిస్తూవుంటుంది. ఉప్పూ, పప్పూ, గుడ్డా గుడుసూ, మందూ మాకూ అవసరాలుకూడా మరిచిపోయి, పుస్తకాలు కొనడమూ, తర్వాత పస్తాయించడమూ మామూలైపోయింది. ఎప్పటికప్పుడు పుస్తకాల షాపులవైపుకు మరి వెళ్ళరాదని అనుకుంటాను. కాని, ఏం లాభం? ఉదయాన్నే "ఇక కల్లుముట్ట"నని ఒట్టు వేసుకుని సాయంత్రంకాగానే కల్లుపాకదగ్గరికి తయారయ్యే త్రాగుబోతు మాదిరిగా, మళ్ళీ నాలుగైదు రోజులనాటికే పుస్తకాల షాపులవద్ద హాజరౌతాను. "ఇది వ్యసనం సుమా!" అంటారు కొందరు మిత్రులు. కావచ్చు. కాని, ఉత్తమ వ్యసనం.

ఈ మద్రాసులో ఎన్ని గ్రంథాలయాలు లేవు? ఎంతెంత పెద్ద గ్రంథాలయాలు లేవు? నిజమే. కాని, మద్రాసులో పెద్ద పెద్ద ధర్మసత్రాలుకూడా ఎన్నో లేవా? వున్నవని నేను వెళ్ళి వాటిలో కాపురం వుంటున్నానా? సత్రం దారి వేరు; ఇంటి దారి వేరు. సత్రంమీద హక్కు ఒక్కరిది కాదు; పదిమందిదీ. దానిలోకి ముసాఫిర్లు వస్తూవుంటారు; పోతూ వుంటారు. నా సౌకర్యంప్రకారం, నా చిత్తంవచ్చినట్లు అక్కడ వుండడానికి వీలా? పైగా, ముచ్చిక మూడురోజు లుండనిచ్చి, నాల్గవనాడు బయటికి నడవమంటారు. ఇంకా వుంటానంటే, రోజుకు పావలా, అర్ధా తెమ్మంటారు. ఇక, నా యింటికి నేనే పెద్దను. నా సౌకర్యాన్నిబట్టి దాన్ని అమర్చుకుంటాను; నా చిత్తంవచ్చినట్టు దానిలో నివాసం వుంటాను. దానిలోనుంచి నన్ను కదలమనడానికి (రెంట్ కంట్రోల్ ఆర్డర్ పుణ్యమా అని, అది అద్దెకొంపైనా) ఎవ్వరికీ అధికారం లేదు. రాజభవనంలాంటి సత్రంకూడా సొంత పూరిగుడిసెతో సరిదూగలేదు. ఏ పక్షికి ఆ పక్షి విడిగా గూడు కట్టుకోవడం ఈ రహస్యం తెలియబట్టే కావచ్చు!

ధర్మసత్రానికీ, పబ్లిక్ లైబ్రరీకీ చాలా సామ్యం వున్నది. లైబ్రరీలో కోరినపుస్తకం కోరినప్పుడు దొరకడం కష్టం. దొరికినా, ఏ వారానికో, పక్షానికో తిరిగి యిచ్చివెయ్యాలి. ఈ గడువుదాటితే రోజుకు అణా చొప్పున జరిమానా

కట్టుకోవాలి. అట్టా గిట్టా చిరిగితే అదొక చిక్కు. ఇందు వల్లనే కన్నిమరా పబ్లిక్ లైబ్రరీపైకంటెకూడా నా చిన్ని పుస్తకసంచయంపైనే నా కెక్కువ ప్రేమ; అధికాభిమానం.

"ఎరవు పుస్తకంవల్ల కలిగే ఆనందం బహుస్వల్ప"మని స్టాన్లీ బాల్డ్విన్ అన్నాడు. ఈ అభిప్రాయంతో నేను పూర్తిగా ఏకీభవిస్తాను. సొంతపుస్తకాన్ని ఒక్కబిగిని చదివి వెయ్యవలసిన అగత్యం వుండదు. ఎప్పుడు కావాలంటే అప్పుడు, ఎంత కావాలంటే అంతే, తాపీగా చదువుకోవచ్చు. ప్రారంభించినతర్వాత విడవకుండా చదివించే పుస్తకమైతే, ఏకతాకీని దాన్ని పూర్తిచేసి, తిరిగి కోరినప్పుడు కోరిన భాగాలు చదువుకుని, మధురస్మృతుల్ని పునరుద్దీపింపజేసు కోవచ్చు. ముఖ్యంగా జ్ఞాపకంవుంచుకోవలసిన భాగాల్ని మార్కు చేసుకోవచ్చు. పుస్తకాన్ని చదువుతూవుండగా తోచినభావాల్ని మార్జిన్‌లో వ్రాసుకోవచ్చు. ఇదేమీ కాక, పుస్తకం విసుగు కలిగించినా, అసహ్యాన్ని పుట్టించినా, కోపాన్ని తెప్పించినా, దాన్ని విసిరిపుచ్చుకు గిరాటు కొట్టవచ్చు. పంజాబ్ కేసరి లాలా లజపత్ రాయ్ ఒకనాడు లాహోర్‌నుంచి ఢిల్లీకి ప్రయాణంచేస్తున్నాడు. పెద్ద ప్రయాణం; ఉబుసు పోదు. అందుచేత ఇన్ని పుస్తకాలు వెంటతీసుకు బయల్దేరాడు. రైలు సాగారిన వెంటనే రుడియార్డ్ కిప్లింగ్ నవల "కిం"ను తీసి, చదవడం ప్రారంభించాడు. పది, పదిహేను పేజీలు చదివాడో లేదో, అది

భారతజాతిని నిరసిస్తున్న ధోరణి ఆయనకు చెడ్డ వెగటు పుట్టించింది. పట్టరాని కోపంతో పుస్తకాన్ని పరిగెత్తుతూ వున్న తన రైలు కిటికీగుండా గిరాటు కొట్టాడు. కాని, అంతలోనే అది యెరవుతెచ్చిన పుస్తక మని జ్ఞాపకంవచ్చి నాలుక కరుచుకున్నాడు. అదే సొంతపుస్తకమైతే, తాను చేసిన భేషైనపనికి నొచ్చుకోవలసిన అగత్యం లాలాజీకి కలిగేదికాదు గదా?

ఏ బిడ్డ అయినా ముద్దుగానే వుంటుంది. కాని, పరాయి బిడ్డ మన బిడ్డపాటి ముద్దు వస్తుందా? ఎరవు పుస్తకానికీ, సొంత పుస్తకానికీ ఇదే భేదమని నా అభిప్రాయం. నా అభిప్రాయమే కాదు; నా అనుభవంకూడా. అందుచేతనే డబ్బు కెన్ని తిప్పలు పడుతున్నా, అప్పు సప్పుల పాలైపోతున్నా పుస్తకాలు కొనడం మానలేను.

కొంతమంది అదృష్టవంతులు పుస్తకాలు కొనరు; వాటిని సేకరిస్తారు. ఈ సేకరణవిద్య—తస్కరణ విద్య కిది మర్యాద వాచకం — నాకు పట్టుపడలేదు. నిజానికి ఇది చాలా తేలికపని. "చదువు కిస్తాను, ఒకసారి పుస్తక మివ్వండి" అని మొహమాట పెట్టడం, దాన్ని జమకట్టివెయ్యడం—ఎంత తేలికపనో చూడండి! చచ్చుపీనుగ ఎవడైనా తన పుస్తకం తనకు తిరిగి కావాలని విడవకుండా వెంటబడితే, "ఇదిగో, అదిగో" అని వాయిదాలు వెయ్యవచ్చు. పది వాయిదాల తర్వాత వాడికే విసుగు పుడుతుంది. లేదా, "ఎక్కడ

పెట్టానో కనబడ్డంలేదు. క్రొత్త ప్రతి కొనియిస్తా" నని చెప్పవచ్చు. మెత్తనివాడైతే, "వద్దులెండి" అని అననే అంటాడు. అనకపోతే, "రేపు కొంటాను; మాపు కొంటాను" అని తిరిగి కాలవిలంబం చెయ్యవచ్చు. ఎంత మొండిఘటానికైనా అప్పటికి ప్రాణం విసిగి తీరాలి. లేకపోతే "మొన్న బీరువా సర్దుతూవుంటే, నీ పుస్తకం కనబడింది" అని అది వాడి ముఖాన గిరగిరతిప్పి కొట్టవచ్చు. కాని, నూటి కొకసారైనా వ్యవహార మింతవరకు రాదు.

మొగమోటపడి పుస్తకాన్ని యెరవిచ్చి, "క్రొత్త ప్రతిని కొనియిస్తా" నన్న మాటకు "ఫరవా లేదు; వద్దులెండి" అని చెప్పడంవరకు నా అనుభవంలో అనేక పర్యాయాలు జరిగింది. ఒక్కసారిమాత్రం తెగబడి "సరే, ఎప్పుడు కొనియిస్తా"రని అడిగాను. నేను కొనియివ్వడం దేనికి? పైక మిస్తాను. మీరే కొనుక్కోండి" అని ఆ పెద్దమనిషి పైయెత్తు వేశాడు. నేను మరీ మొండికెత్తి, "సరే యివ్వండి" అని డబ్బుకు చెయ్యిజాచగా "మీరు మూర్ మార్కెట్‌లో దాన్ని అర్ధరూపాయికి కొన్నామన్నారు గదా?" అంటూ తన మనీపర్సు పైకితీశాడు. చక్కని గ్రంథాన్ని కారుచౌకగా కొనగలిగానన్న సంతోషాన్ని పట్టలేక దాన్ని యెరవిస్తూ నేను నోరు జారినముక్క నాకు జ్ఞాపకం లేకపోయినా, అతడుమాత్రం మరచిపోలేదు. కాస్త తెల్లబోయి, కొంచెం ఉడికిలుతూకూడా, "కాని,

ఇప్పుడు కావాలంటే ఆ పుస్తకం మూర్ మార్కెటులో వుంటుందా? ఉన్నా, మళ్లీ అర్ధరూపాయికే దొరుకుతుందా? దాని అసలుధర అయిదు రూపాయలు" అని నే నన్నాను. "ఈ అర్ధరూపాయి మీావద్ద వుంచండి; దొరకినప్పుడే కొనవచ్చు. ఆలస్యమైతే యేమీా ముంచుకుపోదు లెండి?" అని ఎనిమిదణాల డబ్బులు నా చేతిలో పెట్టబోయాడు. ఏం చెయ్యను? పరాజయాన్ని గుర్తించక తప్పిందికాదు.

పుస్తకాలు కొనడంకంటెకూడా అవి చేతులు మారకుండా పదిలపరచుకోవడమే కష్టమైనపని. సుఖాన్ని, ఆనందాన్ని దాచుకోవడం మానవప్రకృతికి విరుద్ధం. పదిమందికి పంచిపెట్టినప్పుడే మన సుఖం, మన ఆనందం మరింత పరిపూర్ణమైనట్టు తోస్తవి. మంచి పుస్తకాన్ని చదివి ఆనందించినప్పుడు, మిత్రులదగ్గరనో, పరిచితుల దగ్గరనో, దాని ప్రశంస చెయ్యకుండా వుండలేము; మన ప్రశంస విని "అది మీా వద్ద వున్నదా?" అని వాళ్లు అడగకనూ మానరు. అబద్ధాన్ని చెప్పడానికి నోరు రాక—చేసిన నేరాన్ని అచ్చుకుంటున్న ముద్దాయిలాగా—వున్నదని అంగీకరిస్తాము. వెంటనే ఒకసారి చదువు కిస్తామని అడుగుతారు. మొగమోటపడి యిచ్చివేస్తాము. "చదువు కివ్వడంలో" మొదటి భాగమేమో తప్పక జరుగుతుంది; రెండవదే (తిరిగి యివ్వడమే) సంశయాస్పదం. అలాగని మాట దక్కించక పోతే హాస్యానికీ, చతురోక్తికీ పేరందిన అమెరికన్

రచయిత మార్క్ ట్వెయిన్ చేతిలో అతగా డెవ్వడో దెబ్బతిన్నట్టు మనంకూడా దెబ్బతినవలసివచ్చినా రావచ్చు. మార్క్ ట్వెయిన్‌కు ఒకనా డొక పుస్తకం కావలసివచ్చి, తన పొరుగింటి ఆసామికి దాని పేరు చెప్పి, "అది మీా లైబ్రరీలో వున్నదా?" అని అడిగాడు. "ఉన్నది. కావాలంటే మీారు దాన్ని నా లైబ్రరీలో కూర్చుని సంతోషంగా చదువుకోవచ్చు" అని అతగా డన్నాడు. "థాంక్స్" చెప్పి, మార్క్ ట్వెయిన్ అప్పటికి చల్లగా వూరుకున్నాడు. తర్వాత కొన్నిరోజులకు ఆ పొరుగింటి ఆసామికి "లాన్-మావర్" కావలసి వచ్చింది. (లాన్ - మావర్ అంటే మీాకు తెలిసేవుంటుంది. పచ్చిక బయలుమీాద ఈడ్చినప్పుడు, పచ్చికను చదునుగా కత్తిరించే సాధన మది.) "మీావద్ద లాన్ - మావర్ వున్నదా?" అని అతగాడు కబురుచేశాడు. "ఉన్నది. కావాలంటే మీారు దాన్ని మా లాన్ (పచ్చిక బయలు) మీాద సంతోషంగా ఉపయోగించుకోవచ్చు" అని మార్క్ ట్వెయిన్ జవాబు పంపించాడు!

ఎవ రేమి అనుకున్నాసరే ఖాతర్ చెయ్యక పుస్తకాన్ని ససేమిరా యెరవివ్వనివారు కొందరుంటారు. వీరు ఏ తరహా వారై వుంటారో తెలియజెప్పడానికి ఈ కింది కథ ఉపకరిస్తుంది: ఒక పెద్దమనిషి తనకు సుపరిచితుడైన వ్యక్తిని ఏదో పుస్తకాన్ని యెరవివ్వమనగా, అతడు "సారీ" అన్నాడట. "ఈ కాస్త భాగ్యానికే మాట పోగొట్టుకున్నానే!"

అని ఆ పెద్దమనిషి ముఖం చిన్నబుచ్చుకుని, తన బాధను కప్పిపుచ్చుకోడానికి "అది మీవద్ద లేదు కాబోలు లెండి" అన్నాడట. అంతట "అయ్యో! లేకేమండీ! నిక్షేపంలా వున్నది. అయినా, దాన్ని మీకెందు కివ్వనంటున్నానో చెబుతాను—ఇలా దయచెయ్యండి" అంటూ ఆ నిర్భాగ్య మోటి ఆ పెద్దమనిషిని తన లైబ్రరీకి వెంటబెట్టుకు వెళ్ళి, ఇలా అన్నాడట: "చూడండి—ఇరవైవేల గ్రంథాలు బారులు తీర్చివున్నాయి. వీటిలో ప్రతిదీ చదువుకిస్తానని చెప్పి నేను పుచ్చుకున్న పుస్తకమే సుమండీ!"

నిర్భాగ్యమోటిని కాను కనుక నేను పుస్తకాల్ని యెరవివ్వక తప్పదు; అవి పోవడమూ తప్పదు. తస్కరణ విద్యలో ప్రవేశంలేదు కనుక, వాటిని కొనకనూ తప్పదు. ఇతరుల మాట చెప్పలేను గాని, నా విషయంలో జరిగేది మాత్ర మింతే—ఇప్పటికీ, ఎప్పటికీ!





# క్షుద్ర విశ్వాసాలు

దండు నడిపిస్తున్న మాసిడోనియన్ దండనాయకుడు ఫిలిప్‌కు మార్గమధ్యప్రదేశ మొకటి మజిలీచెయ్యడానికి మహా ప్రశస్తమైందిగా కనబడిందట. వెంటనే అతడు "నిలుడహో!" అన్నాడట. ఈ మాట కాకపోతే, తమ గ్రీక్ భాషలో మరొక మాట అన్నాడనుకోండి. సర్వసేనాని ఏ భాషలో "ఖడేరావ్" అన్నప్పటికీ సైన్యాలన్నీ "హాల్ట్" కావలసిందే. అయినా, ఫిలిప్ ఉత్తరువు ప్రకారం అక్కడ మజిలీచెయ్యడం జరగనే లేదు. కారణం: సైన్యాలకు కావలసిన సంభారాన్ని మోసుకువస్తున్న గాడిదలకు అక్కడ మేత లేకపోవడం. అంతట ఫిలిప్ "గాడిదల సౌకర్యప్రకారం బ్రతకవలసిన బ్రతుకు, ఇదేమి బ్రతుకయ్యా! వెధవ బ్రతుకు!!" అని విసుక్కున్నాడట.

అవి ఏమి పాపం చేసుకున్నవో కాని, భూమి పుట్టిననాటి నుంచీ గాడిదలంటే అందరికీ లోకువే! వాటి పేరే ఒక తిట్టు! బుద్ధిలేనివాడు గాడిద. అల్లరిచిల్లరిగా తిరిగేవాడు అడ్డగాడిద. నడుస్తుండగా మోకాళ్లు తగిలేవాడు గాడిద కాళ్లవాడు. పనికిరాని వేపచెట్టు గాడిదవేప. బరువు

మోపై తే, అది గాడిద బరువు. లేనిపోని చిక్కు మెడకు చుట్టుకుంటే అది గాడిదగ త్తర. గొంతు వికారమైనదై తే అది గార్దభస్వరం. కార్యసాధనకు హేయమైన పనిని దేని నైనాచేస్తే "వసుదేవుడంతటివాడు గాడిదకాళ్ళు పట్టుకో లేదా?" అని కుంటిసమర్థన. "గాడిద పుండుకు బూడిద మందు" అని మరొకమాట. ఇంత హీనంగా గాడిదను ఎందుకు చూడాలని అడిగితే, "గాడిద గాడిదే, గుర్రం గుర్రమే" అని సమాధానం. గాడిద, కావాలన్నా, గుర్రం కాలేదనుకోండి. కాని, గుర్రాన్ని తనకంటె భారీజంతువు ఏనుగుగా మారమనండి. దాని తరమాతుం దేమో! ఏనుగుతో పోల్చి గుర్రాన్ని మనం నిరసించనప్పుడు, గుర్రంతో పోల్చి గాడిదను నిరసించటంమాత్రం ఏమి సబబు? దాణా, గీణా అడగకుండా, అది ఎన్ని బరువులు మోసిపెడితే నేమి? ఎంతగా అరవ చాకిరి చేసిపెడితేనేమి? ఎంత ఓర్మిని, కూర్మిని, ఎంత నెమ్మదిని, నిదానాన్ని చూపిస్తే మాత్ర మేమి? అంతా బూడిదలో పోసిన పన్నీరే. నిజ మాలోచిస్తే, దాని మంచే గాడిదకు ఇన్ని తిప్పలు తెచ్చి పెడుతున్నది. మెత్తనివాడిని చూస్తే, ఎవరికైనా మొత్తే బుద్ధి అవుతుంది కాదటండీ! సగోత్రీకునివలె చీటికీ మాటికీ హారాం చేస్తే, గాడిదకు కూడా గుర్రానికి దక్కుతున్న మన్ననే దక్కేది. ఈపాటి ఆలోచించక శ్రీనాథ కవిసార్వ భౌముడంతటివాడు కొండవీటిలో ఏమూలకు వెళ్లినా కుక్క

గొడుగులవలె తనకు కనబడిన కవులను అవహేళన చెయ్యడానికి గాడిదనే అడ్డంపెట్టుకున్నాడు :

బూడిద బుంగవై యొడలు
 పోఁడిమిదక్కి మొగంబు వెల్లనై
వాడల వాడలం దిరిగి
 వారును వీరును జొచ్చొచో యనన్
గోడల గొందులం దొదిగి
 కూయుచునుండెదు కొండవీటిలో
గాడిద నీవునున్ గవివి
 కావుగదా యనుమాన మయ్యెడిన్.

గాడిద దృష్టినుంచి ఆలోచించి, దానిపట్ల సానుభూతి చూపించినవాడు——

ఆడినమాటలు దప్పిన,
గాడిద కొడుకంచుఁ దిట్టగా విని, యయ్యో!
వీఁడా నా కొక కొడుకని
గాడిద యేడ్చెంగదన్న ఘన సంపన్నా!

అని చెప్పిన మహామహు డొక్కడే.

అన్నట్టు, మరొక వ్యక్తికూడా గాడిదకు న్యాయం చేశాడు. అతడు వేదాంతి. మహా వేదాంతికి తగినట్టు గాడిద కూతకు అతడు వేదాంతపరమైన అర్థాన్ని చెప్పాడు. "అయ్ ఖుదా!" అని ముందు గాడిద దేవుని ఎలుగెత్తి పిలుస్తుందట. ఆ పాడుదేవుడు సామాన్యంగా పలికేవాడుకాడు కనుక, "హైఁ? నై? హైఁ? నై?" అంటూ, అతడున్నాడో, లేడో నన్న సంశయంలో పడుతుందట. అప్పటికీ

జవాబు రాకపోయినా, పరాత్పరుని అస్తిత్వాన్ని గురించి శంకించడం పాపమని అంతలోనే గుర్తెరిగి, "హైం! హైం!" అంటూ వున్నాడన్న నిశ్చయానికి వస్తుందట. పదిహేను, పదహారేళ్లనాడు బందరు నేషనల్ కాలేజీలో బసచేస్తూ, ఆ చుట్టుపక్కల గుంపులు, గుంపులుగా వున్న గాడిదల ఓండ్రకు తనకు రాత్రి నిద్రపట్టలేదని ఫిర్యాదుచేసిన గాంధీజీకి అక్కడి హిందీ పండితుడు గాడిదకూత ఈ అంతరార్థాన్ని విప్పిచెప్పేసరికి ఆయన ఫక్కున నవ్వాడు. ఆ తర్వాత రెండు, మూడురోజులు అక్కడే మకాంచేసినా నిద్రాభంగ మౌతున్నదనే మాట తిరిగి ఆయననోట రాలేదు.

ఒక కవిని, ఒక వేదాంతిని విడిచిపుచ్చితే, తక్కిన వారందరు గాడిదను తిట్టినవారే కనుక "నలుగురితోపాటు నారాయణ" అన్నట్టు, ఫిలిప్ గాడిదలను నాలుగు తిట్టినాడని అతడి మాటలను త్రోసివెయ్యరాదు. "ఇంత ఘనుడనైన నా సంకల్పానికి ఏ క్షుద్రప్రాణుల కారణంగానో, ఏ క్షుద్ర విషయాల కారణంగానో వికల్పం జరగనా!" అన్న అహం భావమే అతడిచేత ఆ మాటలను అనిపించింది. బలదర్పాలు గల వారందరికీ ఇట్టి అహంకృతి కొద్దిగానో, గొప్పగానో వుండనే వుంటుంది. అహం బలిసినందునే కైలాసగిరిని యెత్తడానికి రావణాసురుడు పూనుకున్నాడు! అహం కన్ను గప్పినందునే దారికి అడ్డంగా తగిలిన హనుమంతుని తోకను ఎడమకాలితో పక్కకు నెట్టివెయ్యడానికి భీమసేనుడు ప్రయ

త్నించాడు. ఉభయులకు పరాభవం తప్పలేదు. శివుడు కాలి బొట్టనవ్రేలుతో కాస్త నొక్కేసరికి లంకాధిపతి కుక్కిన పేను కావలసివచ్చింది; తనకు కంఠోపాఠంగా వచ్చిన శివస్తోత్రా లన్నింటినీ గుక్కతిప్పుకోకుండా ఏకరవు పెట్టవలసివచ్చింది. ప్రల్లదనానికి పోయి పశ్చాత్తాప పడవలసి వచ్చిన ఆ పది తలల, ఇరవై చేతుల త్రిలోకకంటకుని ఈ గర్వభంగగాథ ప్రాచీన భారతీయ శిల్పుల నెందరినో మహోత్తమ శిల్పాల సృష్టికి పురికొల్పింది. ఎల్లోరాగుహ లన్నింటికీ కైలాసం శిరోభూషణం కాగా, దానిలో మకుటాయమానస్థానం లంకేశ్వరుని గర్వభంగ శిల్పానిది. భువనేశ్వర్‌లోని పరశు రామేశ్వరాలయంపై ఎన్నో ఉత్తమ శిల్పా లుండగా, అగ్ర తాంబూలం తిరిగి దశకంఠుని గర్వభంగానిదే. భీముని భంగపాటు శిల్పాల కెక్కలేదుగాని, హరికథకులు తరచు దాన్ని చెప్పనూ చెబుతారు; ఎన్నిసార్లుచెప్పినా వినేవారు చెవికోసుకుంటూ దాన్ని విననూ వింటారు. అహంకారం కొద్దీ ఫిలిప్ "గాడిదల సౌకర్యంప్రకారం బ్రతికే బ్రతుకు, ఇదేమి బ్రతుకయ్యా! వెధవ బ్రతుకు!!" అన్నప్పటికీ, వాటి వీలునుబట్టే మజిలీచేశాడు గాని, లేకపోతే ఆ క్షుద్ర ప్రాణుల కారణంగానే అతడికీ గర్వభంగ మయ్యేది.

మనం వెనక్కుతిరిగి పారజూచుకోము గాని, క్షుద్రంగా తోచే ప్రాణులపైనే, వస్తువులపైనే మన బ్రతుకు చాలా వరకు ఆధారపడివుంటుంది. మనకు కూడుపెట్టేవి ఎంతటి

తుపాను వచ్చినా లెక్కచేయక తలనెత్తుకు నిలిచే మహా వటవృక్షాలు కావు; చిరుగాలికి సయితం తల్లడిల్లిపోయే క్షుద్రపు వరి, జొన్న, గోధుమ మొదలైన మొక్కలే. మనకు గుడ్డనిచ్చేవి మిన్నుముట్టే తాటి, కొబ్బరి వగైరా చెట్లు కావు; నిలువెత్తుకైనా పెరగని ప్రత్తిచెట్లే. మనం విలువైనవిగా చూచుకునే చీని చీనాంబరాలను మనకు కూర్చేవి కొందరు చూడ్డానికే చీదరించుకునే పట్టుపురుగులు. "ఏనుగుపాడి" మనకు పనికివచ్చేది నుడికారంగామాత్రమే; పాలు, పెరుగు, నెయ్యి కావాలంటే మనం సంపాదించుకోవలసింది ఆవులను, బర్రెలనే. జబ్బుచేస్తే వెండి, బంగారాలను మందుగా మ్రింగము; దమ్మిడీకైనా కొరగావని ఇతర వేళలలో త్రోసిపార వేసే ఏ మూలికలకోసమో పరుగు లెత్తుతాము. ఇంత దేనికి? లూయీ పాశ్చర్‌ను అడిగితే, మన చావు బ్రతుకులన్నీ కంటికి కనబడని సూక్ష్మాతిసూక్ష్మ జీవులు "బ్యాక్టీరి"పై ఆధారపడి వున్నట్టు చెబుతాడు.

ఈ విశ్వంలో వాస్తవానికి ఏదీ క్షుద్రం కాదని గుర్తించి, అందుకు అనుగుణంగా జీవితాన్ని గడపగలిగితే, ఆ జీవితం ధన్యమే అవుతుంది. కాని, ఇందుకు మారుగా క్షుద్ర విశ్వాసాల ప్రకారం బ్రతుకును వెళ్ళబుచ్చడమే ఎక్కువగా కనబడుతుంది మనలో పెక్కుమంది. నిత్యజీవిత రథానికి క్షుద్రవిశ్వాసాలే చక్రాలు. నిద్రమంచంనుంచి లేస్తూనే గోవునో, పుణ్యస్త్రీనో చూస్తే శుభం; పిల్లినో, విధవనో

చూస్తే అశుభం. వాళ్లు విరుచుకుని మంచంపైనుంచి కాలుకింద పెట్టబోతుండగా ఎవరైనా పుటిక్కిన ఒకటి తుమ్మితే చేటు: రెండు తుమ్మితే గ్రుడ్డిలో మెల్ల. చెంబు చేతబుచ్చుకుని అవతలికి వెడుతుంటే, నూనె ఎదురుగా వస్తే కీడు, నక్కను తొక్కితే మేలు. తిరిగి వచ్చి, దంత ధావన చేద్దామని చూరులోని వేపపుల్లలకు తడుములాడు తుండగా అలికిడికి బెదిరిన బల్లి జారి పైనపడుతూ కుడి ముంజేతిని తాకితే పీడ; ఎడమ ముంజేతిని తాకితే కీర్తి. స్నానపానాలు పూర్తిచేసి, పనిపాటలకు కదలగా, వొంటి బ్రాహ్మడు యెదురొస్తే కార్యభంగం, కోమటి యెదురైతే కోటిలాభాలు. ఈ క్షుద్ర విశ్వాసాలకు పారమే లేదు. చివరికి గడ్డం గీకించుకోవాలన్నా, బుర్ర దొక్కించుకోవాలన్నా, తిథి వార నక్షత్రాలు చూడాలి. అందుకు మంగళ, శుక్రవారాలు పనికిరావు; చవితి, అష్టమి, నవమి, చతుర్దశి పనికిరావు; అమావాస్య తగదు. తిథి వార నక్షత్రాలు కుదిరినా, గృహిణి గర్భవతి కారాదు; మైలరోజులు కారాదు; ఇంకేమేమో కూడదు. పొరుగూరుకు ప్రయాణం పెట్టుకున్నా, నూతన వస్త్రాన్నో, ఆభరణాన్నో ధరించాలన్నా ఇన్ని పట్టింపులూ తప్పవు.

ఒక్క మన దేశంలోనేకాక, దేశదేశాలలోనూ ఇట్టి క్షుద్ర విశ్వాసాలు మూఢమతులపై రాజ్యాన్ని చేస్తూనే వుంటాయి. పదమూడు కీడు మూడించే దుష్టసంఖ్య అని

పాశ్చాత్యుల పిచ్చినమ్మకం. భోజనానికి పదముగ్గురు కూర్చో వలసివస్తే, ఒకరు తగ్గుతారు; లేదా, చివరికి బల్లరునైనా సరే పధ్నాల్గవవానిగా కలుపుకుంటారు. ఇళ్ళవరసలో తమది పదమూడవదికావడం తటస్థిస్తే, దానికి "12-ఎ" అని నంబర్ వేయించుకుంటారు. ఇంతే కాక, చేతిలో అద్దం పగల రాదని, నిచ్చెనకింద నడవరాదని, ఒక అగ్గిపుల్లతో ముగ్గురు సిగరెట్లను ముట్టించుకోరాదని, డైనింగ్ టేబుల్‌పై ఉప్పు చిందరాదని, శుక్రవారంనాడు ఓడను బయలుదేరదీయ రాదని ఎన్నెన్నో మూఢనమ్మకాలు వారికీ వున్నాయి.

ఇవి తగవని క్షుద్ర విశ్వాసాలను ఎంతగా ఖండించినా వాటి ప్రాబల్యం తగ్గదు. అవి లొంగేది ప్రచారబలానికి కాదు; పరిస్థితుల బలానికి. రైళ్ళలో, బస్సులలో, విమానాలలో ప్రయాణాలు వచ్చినతర్వాత ఇప్పుడు వర్జ్యం వున్నదని, శుభ ముహూర్తం ఇంకా కుదరలేదని కూర్చునేవారికోసం అవి ఆగుతవా? తలచెడిన మనిషి ఎదురొచ్చిందని ఫ్యాక్టరీకో, ఆఫీసుకో లేటుగా వెడితే పైవారు వూరుకుంటారా? అయితే, పరిస్థితులు బలీయమైనా, వెనకనుంచి ఒక తాపు తన్నేవరకు పాతదారినే నడవక, ప్రయత్నపూర్వకంగా క్షుద్ర విశ్వాసా లనుంచి బయటపడగలవారే విజ్ఞులని మెప్పు పొందగలుగు తారు. ఏమైనా, గార్దభాన్ని క్షుద్రజీవిగా యెంచిన మాసి డోనియన్ దండనాథుడైనా క్షంతవ్యుడు కాగలడు గాని, గాడిద కూస్తే చేస్తున్న పని మానుకునేవాడు మాత్రం క్షమార్హుడు కానేరడు.



# బాలానందం

ఏదైనా ఒక వ్యాసాన్ని ఇంటివద్దే వ్రాద్దామనుకున్నాను. ఇందుకు కారణం మరేమీ లేదు "ఆదివారంపూటైనా ఇంటిపట్టున వుండగూడదా?" అని మా ఆవిడ అనింది. దాదాపు పగలంతా నాకు ఆఫీసుపనితోనే సరిపోతుంది. పొద్దున తొమ్మిదిగంటలకు బయల్దేరితే, తిరిగి రాత్రి ఏడెనిమిది గంటల తర్వాతే ఇంటికి చేరుకోవడం. "ఇదుగో నాన్న వస్తున్నాడు; అదుగో నాన్న వస్తున్నాడు" అంటూ కళ్లు కాయలు కాచేటట్టు దారి కాచి కాచి, ఒక్కొక్క రోజున నేను తిరిగి వచ్చేసరికి పిల్లలు నిద్రపోతారుకూడా! ఈ పరిస్థితిలో మా ఆవిడ "ఆదివారంపూటైనా ఇంటిదగ్గర వుండగూడదా?" అని అన్నదంటే, దానిలో పెద్ద నింద, కొంత బాధ మిళితమై వున్నాయన్నమాట!

ఆఫీసుకు బయల్దేరినవాణ్ణికూడా ఈ మాట తర్వాత ఆగిపోయాను. ఆగి, వ్యాసాన్ని వ్రాయడానికి కూర్చుంటే, ఒక్క అక్షరమైనా రాలితే వొట్టు. మాపిల్ల వచ్చి "నాన్నా! ఏం రాస్తున్నావ్?" అని అడిగింది. వ్యాసమని చెబితే, మూడేళ్ళదానికి అర్థమౌతుందా, పెడుతుందా? "ఉత్తరం"

అన్నాను. "ఎవరికి?" అని వెంటనే ప్రశ్న. "నాయనమ్మ కులే! నీవు వెళ్ళి ఆడుకో, తల్లీ!" అని బుజ్జగించి పంపి వెయ్యబోయాను. కాని, కదిలితేనా! "నాయనమ్మ ఎక్కడుంది?" అని నామాట పూర్తికాకముందే మళ్ళీ ప్రశ్న.

అబ్బబ్బ! పిల్లలు వేసే ప్రశ్నలకు అంతు వుండదుగదా! మనం ఒకదానికి సమాధానం చెప్పగానే, వాళ్ళకు మరి నాలుగు ప్రశ్నలు స్ఫురిస్తాయి. వాళ్ల కళ్ళకు ఈ ప్రపంచం కొత్తగా, వింతగా కనబడుతుంది. కొత్తగా ఈ ప్రపంచం లోకి వచ్చినవాళ్లు కనుక, పిల్లలచిత్తవృత్తి కొత్త ఊరుకో, నాడుకో వెళ్లినప్పటి మన చిత్తవృత్తిని పోలివుంటుం దను కుంటాను. అయితే, అజ్ఞానాన్ని ఎక్కడ బయలుపెట్టు కుంటామోనన్న భయంవల్ల నేమి, సభ్యతకు విరుద్ధమేమో నన్న సంకోచంవల్లనేమి మనకు తెలియని ప్రతిదాన్నిగురించీ మనం ప్రశ్నలు వెయ్యము. ఇంతేకాదు. తెలియని విషయం కూడా తెలిసినట్టుగానే నటించడానికి ప్రయత్నిస్తాము. పిల్లలలో ఈ భయం, ఈ సంకోచం, ఈ కపటం వుండవు. అందుచేత వాళ్లు ప్రశ్నలవర్షాన్ని కురిపిస్తారు. ప్రతిదీకూడా కొత్తగా, వింతగా తోచడం అలా వుండగా, వాళ్ళకు తెలియకుండానే వాళ్ళలోవుండే జ్ఞానతృష్ణసయితం వాళ్లు వేసే ప్రశ్నపరంపరకు కారణమౌతుంది. పిల్లల మనస్సు, శరీరం కూడా అపరిపక్వ స్థితిలో వుంటాయి. అవి అలాగే వుంటే, ప్రకృతీచ్ఛ సంపూర్ణంకాదు. అంచేత తన ఇచ్ఛాపూర్తికి

దోహదమివ్వగల స్వభావాల్ని అది కల్పిస్తుంది. పిల్లల్ని చూడండి: చిరుతిండికోసం ఎంత ఆరాటపడతారో! వాళ్ల శరీరాభివృద్ధికి అది ప్రకృతిచేసిన కిటుకు. ఇక, వాళ్లువేసే ప్రశ్నలు వాళ్లమానసికాభివృద్ధికి ప్రకృతి కల్పించిన ఆలంబన.

మన పనులకో, మన మాటలకో అడ్డువస్తున్నారని పిల్లలువేసే ప్రశ్నలన్నింటికీ మనం జవాబు చెప్పము. ముద్దుకొద్దీ ముందు రెండు, మూడింటికి మాత్రం జవాబు చెప్పి ఆతర్వాత కసిరికొడతాము. నిజానికి ఇది చాలా తప్పు. "మాకు కూడుగుడ్డల్ని యిచ్చితీరా"లని తల్లిదండ్రుల్ని అడగడానికి పిల్లలకు ఎలాంటి హక్కువున్నదో, "మా ప్రశ్నలన్నింటికీ జవాబు చెప్పితీరా"లని పట్టుపట్టడానికి సయితం వాళ్ళకు హక్కు వున్నది. "ఏమిటి, ఈ చొప్పదంటు ప్రశ్న" లని మనం వాళ్ళను విదిలించి పారవేశామంటే, వాళ్ళ జన్మహక్కును హరించామన్నమాటే. అడిగినప్పుడల్లా పిల్లలకు చిరుతిండి పెడితే అజీర్ణం తప్పదు. కాని, అడిగిన ప్రతి ప్రశ్నకు ప్రత్యుత్తరమివ్వడంవల్ల వారిమనస్సు వికసిస్తుందే తప్ప, మానసిక రుగ్మత ప్రవేశించదు. అయినా, మనం పిల్లల ఆహారం విషయంలో చూపినంత సహనాన్ని వాళ్ళ ప్రశ్నలవిషయంలో చూపించము. ఇది పూర్తిగా పొరపాటు: కేవలం అజ్ఞానం.

పిల్లల ప్రశ్నలన్నింటికి మనం ప్రత్యుత్తరమివ్వలేకపోవడానికి మరొక కారణంకూడా లేకపోలేదు. అమా

యికంగా వాళ్లు వేసే కొన్నిప్రశ్నలు పేగులు తెంచేవిగా వుంటాయి. "దేవుడొచ్చి కొబ్బరికాయ తినిపోడేమే అమ్మా?" అని నిలవేస్తే ఏమి జవాబు చెప్పగలము? "నాకేం—మొన్నేం—అమ్మోయ్!—కడుపుబ్బితే తమల పాకులు పెట్టి— మరేం— పొట్ట కాచావ్. నువ్వు, మరి, కాచుకోవేమే, అమ్మా?" అని నెలలునిండుతున్న తల్లిని నిగ్గదీస్తే జవాబేమిటి? "నాన్న నన్ను కొట్టాడు. బూచాడి నొచ్చి నాన్నని ఎత్తుకుపొమ్మన వేమి తాతా! అంటావా, అనవా?" అని మారాంచేస్తే, అది మనం నూరిపోసిన పిచ్చి భయాలతో మనలనే బెదిరించడంకాదా? "మన పక్కవాళ్ళకు బోలెడంత జాగా వుంది. ఇల్లు కట్టుకోడానికి మనకు కాస్త ఎందు కివ్వరు, నాన్నా?" అనే ప్రశ్న మన సాంఘికవ్యవస్థ పునాదిపైనే వ్యాఖ్యానం కాదా? "నా నేస్తం రామానికి— పాపం!— అన్నీ చిరుగు చొక్కాలే. నాదొకటి వాడి కిచ్చొస్తే ఎందుకమ్మా కోప్పడతారు ఊరికేను? నాకు కొత్త చొక్కాలు పెట్టి నిండా లేవూ?" అని ముద్దు ముద్దుగా ఒకమాట ఊడవేస్తే, అది మన సంకుచితబుద్ధిపై గొడ్డలిపెట్టే కాదా? కాగితపు పడవచేసి, నీళ్ళబిందెలోవేసి, "రండి! చందమామ ఊరెడదాం. ఎక్కరేం? భయమా?" అని పృచ్ఛచేస్తే, మధుర స్వాప్నికజగత్తుకు మనం పరదేశీల మైపోయామన్న నింద దానిలో లేదా?

ఇట్టి పసితనపు ప్రశ్నలువేయడం పసితనంలోనే నిలిచి పోతే, మనకు పురోభివృద్ధి వుండేదే కాదు. అన్నింటికంటె ప్రాచీనగ్రంథం ఋగ్వేదాన్ని చూస్తే, "ఎర్రని ఆవు తెల్లని పాలను ఎలా యిస్తున్నది?" అని బాలోచిత విస్మయ పూర్వక ప్రశ్న కనబడుతుంది. దానిలోనే మరొకచోట "పడమటికి క్రుంగజొచ్చిన సూర్యుడు జర్రున జారి భూమిపై పడిపోడేమో?" అని ఇంకొక ప్రశ్న వున్నది. నదీనదాల స్వచ్ఛతరళోదకాలు సతతం వచ్చి పడుతున్నా సముద్రం పొంగిపొరలదేమి?" అనే ప్రశ్నకూడా దానిలోనిదే. ఈనాడు ఇట్టి ప్రశ్నలను "సిల్లీ" అని ఒక్కమాటలో మనం త్రోసిపారవెయ్యవచ్చు. కాని, ఆదిమానవునికి ఇట్టి సందేహాలే తోచివుండకపోతే, వీటిలో గర్భితమైవున్న జిజ్ఞాస అతడిలో ఉదయించివుండకపోతే, నేటికీ మనకు ఆటవికస్థితి తప్పేదికాదు. మానవ సంస్కృతీ చరిత్రను ఒకసారి సింహావలోకనం చేస్తే, ప్రశ్నోత్తరాలే దానికి పునాదులని తెలుస్తుంది. మన ఉపనిషత్తులన్నీ గురుశిష్యుల మధ్య నడిచిన ప్రశ్నోత్తరాలే. గురువుసన్నిధిని కూర్చుని ప్రశ్నలువేసి వాటికిపొందిన ప్రత్యుత్తరాల సంపుటీకరణాలు కనుకనే అసలు వాటికి ఉపనిషత్తులని పేరువచ్చింది. ఉపనిషత్తులకు మూలాధారులైన మన ప్రాచీన ఋషులను పోలిన గ్రీక్ తత్త్వవేత్త సోక్రటీస్కూడా పృచ్ఛరూపకంగానే సృష్టి రహస్యాలను వెల్లడించడానికి ప్రయత్నించాడు.

పదుగురున్నచోటకు చేరి ప్రశ్నల వర్షాన్ని కురిపించడమే ఆయనకు ప్రధానవ్యాపకం. చివరికి ఇటీవలి మన బ్రహ్మం గారుకూడా సిద్ధయ్యగారి ప్రశ్నలను పురస్కరించుకుని వేదాంతబోధ చేసినవారే.

పెరిగి పెద్దవారమైనామని విర్రవీగే మనం వింత ప్రశ్నలని, విడ్డూరపు ప్రశ్నలని, వెర్రిమొర్రి ప్రశ్నలని, అడ్డగోలు ప్రశ్నలని, చొప్పదంటు ప్రశ్నలని పెదవి విరిచేవే మన వేద వేదాంగాలకే కాక, ఆధునిక వైజ్ఞానిక శాస్త్రాల్లన్నింటికీ మూలమైనాయి. ''చెట్టునుంచి రాలిన యాపుల్ నేల మీదికే ఎందుకు పడాలి? ఆకసంలోకి ఎందుకు ఎగిరిపో రాదు?'' అని సర్ ఐజక్ న్యూటన్‌కు తోచిన కుంటిప్రశ్నే గురుత్వాకర్షణ సిద్ధాంతానికి దారితీసింది. ''కెటిల్ మూతను కుదిపివేయగలుగుతున్న ఆవిరికి యంత్రాలను కదిలించగలశక్తి లేదా?'' అని జేమ్స్ వాట్‌కు పట్టినప్రశ్నే స్టీమ్ యింజన్‌కు కారణభూతమైంది. ''యూరేనియం లవణాల సమీపంలో పెట్టిన ఫొటోగ్రాఫిక్ ప్లేట్లు ఎక్స్‌పోజ్ అయిపో తున్నవేమి?'' అని ఒక ఫ్రెంచి శాస్త్రవేత్తను పీడించిన ప్రశ్నే మదాం క్యూరీ రేడియం కనిపెట్టడానికి తోడ్పడింది. సందేహంలేదు—ప్రశ్నే ప్రగతికి పంచప్రాణాలూ.

అయితే, నేను మాపిల్లవేసిన మూడో ప్రశ్నకు జవాబు చెప్పి, నాల్గోదానికి వీలు కలిగించలేదని ఇక్కడ ఒప్పు కొనక తప్పదు. ''ఎక్కడో ఒకచోట వున్నదిలే, పోవే

పో!" అని గద్దించేసరికి, కూనిరాగం తీస్తూ వాళ్ళ అమ్మ దగ్గరికి వెళ్ళిపోయింది.

చెదరివున్న ఊహల్ని కూడగట్టుకుని, "దేన్నిగురించి ఇప్పుడు వ్యాసాన్ని వ్రాయడమా?" అని ఆలోచన ప్రారంభించేసరికి మా పిల్లవాడు, కొత్తగా తీగమీద నడవడాన్ని నేర్చుకొంటున్నవాడివలె, చేతులుచాచి, నడ్డివంచి, బ్యాలెన్సు చేసుకోడానికి ప్రయత్నిస్తూ, పది అడుగులు వేసి, ఠపీమని ముందుకుపడి, నవ్వుకుంటూ లేచి, "ఆఁ! ఆఁ! ఆఁ!" అని కేరుతూ, కాళ్ళచేతులమీద చకచక పాకుతూ చక్కా వచ్చాడు. "ఇక, ఈనాటికి వ్యాసం నడిచినట్టే!" అని వాణ్ణి చూడగానే నేను ఆశ వదులుకున్నాను. వచ్చీరావడంతోటే పైకెగబ్రాకి, నా చేతిలోని పెన్సిల్ వూడబెరుక్కున్నాడు. తర్వాత కాగితాలకోసం చెలగడం ప్రారంభించాడు.

"అబ్బబ్బ! అల్లరి పెడుతున్నాడు! వీణ్ణి కాస్త అవతలికి తీసుకుపోరాదా!" అని మా ఆవిడను కేకవేశాను. కాని, పిల్లవాడు ఆగితేనా? చెలిగి, రక్కి, ఏడ్చి, పీకి, పాకానపెట్టి తిరిగి నావద్దకే వస్తానంటాడు. కాస్త కాలురాగానే పిల్లలుచేసే అల్లరికి అంతు వుండదుగదా! ఉదయంపూట మరీని!! ప్రొద్దుక్రుంకగానే వాళ్లు నిద్రపోతారు. చీకూ చింతా లేనివాళ్ళుకావడంచేత కమ్మని నిద్రపడుతుంది. ఏ మధురదృశ్యాలు—కాదు, ఏ దివ్యలోకాలు—కలలలో కనబడతాయోగాని, వెన్నెల వెలుగుల్ని మరిపిస్తూ

చిరునవ్వులు నవ్వుతూ వుంటారు. మృత్యువును జీవనంవలె, చీకటిని వెలుగు చీల్చుకురావడం ప్రారంభించినంతనే నిద్ర లేస్తారు. బ్రతుకువలె నిద్రకూడా భారమైన పెద్దవాళ్లు పెందలాడే నిద్రనుంచి లేవలేకపోవచ్చు. కాని, పసివాళ్ళు మాత్రం ప్రకృతితోపాటు, పక్షులతోపాటు, మందానిలం తోపాటు మేల్కొంటారు. మేల్కొన్నంతనే క్రొత్త బలంతో, క్రొత్త ఉత్సాహంతో, క్రొత్త ఆనందంతో అల్లరిని ప్రారంభిస్తారు. ప్రతి వసంతంలో ప్రకృతిలో వెల్లివిరిసే నూతనత్వం ప్రతి ప్రత్యూషాన పసివాళ్ళలో కనబడుతుంది.

మా పిల్లవాడి అల్లరికి తట్టుకోలేక, "మరి నేను ఆఫీసుకు పోనా?" అని నేనన్నాను. నవ్వుతూ "త్వరగా తిరిగి వస్తారు గదా!" అని మా ఆవిడ అనింది.

ఇక్కడికి చేరినతర్వాతకూడా "దేన్ని గురించి వ్రాయనా?" అనే సమస్య నాకు తెగనే లేదు.





# మంత్రయుగం

సత్యకాలంలో అందరి పనీ మూడు పువ్వులు, ఆరు కాయలుగా వుండేది. ధర్మదేవత ఒంటికాలిపై నడుస్తున్నందున ఈ పాడు కలికాలంలోనే బ్రతుకింత భారమైపోతున్నది. ఈనాడు మనకిన్ని కడగండ్లు తెచ్చిపెడుతున్నందుకు ధర్మదేవతను నిలవేసి, నాలుగు కాళ్లుండగా ఒక్కదానిపైనే ఎందుకు నడుస్తున్నావని నాలుగూ దులిపితే బాగుండును. "మూడు కాళ్లు కట్టివేసుకుని. ఒక్కదానిపైనే నడుస్తాను—తమాషా చూడండి" అనడానికి ధర్మదేవత దొమ్మరిసాని కాదు గదా! పోనీ, తన కుల గోత్రాలను మరచి, సిగ్గు యెగ్గులను విడిచి, దొమ్మరాటకే దిగిందనుకోండి. దానికైనా హద్దూ పద్దూ వుండాలా? త్రేతాయుగం ప్రవేశంలో డోలు కొట్టి, గడ కట్టింది. "మూడు కాళ్లతోనే నడుస్తా—దేఖో మేరా తడాఖా" అనింది. ద్వాపరం వచ్చేసరికి, రెండుకాళ్లపైనే నడిచి చూపిస్తానన్నది. ఆ యుగం గడిచిపోయినా, గడ దిగలేదు సరిగదా, ఒంటి కాలిపై ఫీట్స్ ప్రారంభించింది. చివరికి కోడి రామమూర్తి సర్కసునైనా రెండు రోజులు వరసగా

చూస్తే, మూడో రోజుకు ముఖం మొత్తేది. రెండు యుగాలకు యుగాలే దొర్లి పోయినా, ఇంకా ఈ దొమ్మరి మొగ్గలనే చూస్తూ కూర్చోమంటే వాళ్లు భగ్గున మండుకు రాదా? అందదు గాని, అందితే, వెర్రి మొర్రి వేషాలు వేస్తున్నందుకు ధర్మదేవతను వెయ్యి వాలికలు చేసి, ఉప్పు పాతరలో ఊరవేసినా పాపం వుండదు.

ఏమైనా గాని, ఘోరకలి వచ్చి పడిందనడం మాత్రం నిజం. ఘోరకలి కాబట్టే కలీ గంజీకూడా కరువై పోయాయి. రెక్కాడినా డొక్కాడడం లేదు. చెమటోడ్చ డమే కనబడుతున్నది తప్ప, చింతాకంతైనా సుఖం కన బడ్డం లేదు. అయినా, వైజ్ఞానిక శాస్త్రాలలో ఏదో వెలగ బెట్టినామని, ప్రకృతిని వశవర్తినిగా చేసుకున్నామని, "అన్నమో రామచంద్రా!" అని అఘోరించవలసిన కాలం పోయి సమృద్ధియుగం పాదం పెట్టిందని, ప్రపంచంలో ఇంకా దారిద్ర్య, దైన్యాలు మిగిలివుంటే, అందుకు మన ఆర్థిక. సాంఘిక, రాజకీయాది వ్యవస్థలలోని లోపాలే కారణమని పాశ్చాత్యులనుంచి నేర్చుకున్న చిలక పలుకులు పలుకు తున్న ప్రబుద్ధులు కొందరు మనలో వున్నారు.

యంత్రాలు వచ్చి బండచాకిరి తప్పించి వేశాయనేది ఈ పాశ్చాత్య మానసపుత్రులు చెప్పే యెంగిలిమాటే! ఒక్కయంత్రం పదిమందిపెట్టు కాగలదట. మళ్లీ మాట్లాడితే

పది పదులు నూరుమంది పెట్టుకాగలదట. మనం మీట నొక్కితే మిగిలిన పనినంతటినీ చకచకా, బిరబిరా, ధణధణా తామే చేసి పారవేసే యంత్రాలు కూడా వున్నవట. అసలిది "యంత్రయుగ"మట. ఈ మాటల్ని వింటుంటే "ఆరి మీ తెలివి తెల్లార !" అనబుద్ధివేస్తుంది. యంత్రాల వల్ల పని కాస్తో కూస్తో తేలికగానే తెములుతుం దనుకోండి. కాని, ఆ యంత్రాల తయ్యారీకి ఎంతగా రెక్కలు విరుచుకోవాలి! బొగ్గు వేసి, ఆయిల్ పోసి, వాటిని మేపడానికి ఎంత రొష్టుపడాలి ! పైగా, అవి "నడిస్తే బండి, నిలిస్తే మొండి". ఒక్క సీల పోయినా మరి చిల్లిగవ్వకు కొరగావు. మనకు తిండి పెట్టడానికి ముందు మన ప్రాణాల్ని నిలువునా తోడివేస్తాయి. ఇదే ఈ యంత్రయుగం సౌభాగ్యం !

సత్యకాలంలో యంత్రాలూ, గింత్రాలూ "జా న్తానై". కేవలం మంత్రాలతోను, తంత్రాలతోను ప్రతిపనీ అతి సులు సుత్రంగా, మహా సునాయాసంగా జరిగిపోయేది. ఇప్పటిది యంత్రయుగమౌనో, కాదోగాని, అప్పటిది నిస్సంశయంగా "మంత్రయుగం". కోతులేమి, బిసాదేమి పంటలు చెరుపుతున్నాయని వాటిని చంపి వెయ్యాలంటే, ఈనాడు అందుకు నగదు బహుమానాలట! ఆ బహుమానాలు పొందడానికి వలలు, బోనులు, కత్తులు, కటారులు, తూటాలు, తుపాకులు—ఎంత హంగామా! అదే వెనకటికాలంలో

భూసురులను పదిమందిని కూకవేసి, సర్పయాగానికి కూర్చుంటే బురదకొయ్యమొదలు కొండచిలువవరకు, కోడెత్రాచుమొదలు జెర్రిపోతువరకు, భూమండలంలోని సర్పాలన్నీ కుండాగ్నులలో వచ్చిపడి, మలమల మాడిపో వలసిందే! ప్రాణాలకు భయపడి పురందరుని కడకు "సుర గణాధిప నన్నున్ రక్షింపుమ, రక్షింపుమ, రక్షింపుమ యనుచున్" పరుగులెత్తినా, "సహేంద్రాయ తక్షకాయ స్వాహా" అని మంత్రోచ్చారణ చేసేసరికి, ఇంద్రుడు గింద్రుడు సమేతంగా కదలిరావలసిందే!

సర్ప సత్రాలో, శత్రు సంహారాలో మాత్రమే కాకుండా, మంత్రబలంతో ఇతర కార్యాలూ, కరామత్తులూ కూడా జరిగేవి. అంపశయ్యపై వొరిగిన భీష్మాచార్యునికి అభి మంత్రించిన మూడు బాణాలతో గాండీవి తలగడ యేర్పాటు చేయగలిగాడు, ఆ ముసలాయనే మామూలు నీళ్ళు ముట్టననీ, భూజలం కావాలనీ మంకుపట్టు పట్టగా, సవ్యసాచి తేజోమయమైన మార్గణాన్ని పర్జన్య మంత్రాభిమంత్రితం చేసి, మహీతలంలోకి ప్రయోగం చేసేసరికి, "భాసురచ్ఛా యంబగు తోయంబు ధారారూపంబున దివ్య గంధ రసో పేతంబయి" మొగసింది. అర్జునుడు ప్రదర్శించిన ఈ మంత్ర బలానికి "ప్రకంప గాఢ విస్మయులై" కూడా కౌరవులు అంతటితో యుద్ధాన్ని కట్టిపెట్టి సంధి బేరానికి దిగలేదను

కోండి. కాని, "మంత్రాలకు చింతకాయలు రాలతాయా?" అనే వెక్కిరింపుతో వారు గుండెను నిబ్బరపరచుకోలేదు. "ఒక మంత్రానికి మరొక మంత్రం అడ్డు పడకపోతుందా!" అనే భరోసాతోనే వారు భండనాన్ని మానలేదు.

పెద్దమ్మవారు వచ్చి నెత్తిపై కూర్చున్న కౌరవులమాట కేమిగాని, అర్జునునికున్న మహా మంత్రశక్తి ఈనాడు మన మంత్రులలో ఏ వొక్కరికైనా వుంటే, దమ్మిడీ ఖర్చు లేకుండా, రవ్వంత శ్రమలేకుండా, డ్రిల్సు, గిల్సుతో పని లేకుండా మనకు ఎన్ని "అర్టీజియన్" బావు లేర్పడేవి కావు? ఎంతగా అధికాహారోత్పత్తి జరిగేదికాదు? ఆ మాటకొస్తే, ఒక్క ద్రౌపది ఈనాడు మనకుంటే, గృహంబున తండులంబులు నిండుకున్నా, ఎందరు దూర్వాసులు, ఎన్ని పదివేలమంది శిష్యులతో వచ్చినా షడ్రసోపేతంగా భోజనం పెట్టగల తాహతు మనకు వుండేది కాదా? వాక్యం ఊపులో పడి, "ఒక్క ద్రౌపది ఈనాడు మనకుంటే" అన్నానే కాని, ఇది పొరపాటు. ద్రౌపదుల కేమి కొరత? వారు కొల్లలుగానే వున్నారు. ఎటొచ్చీ ఆ పంచపాండవ పత్ని శక్తియుక్తులే అపరూపమై పోయాయి.

గాంధి మహిమాన్వితుడని మనం గొప్ప చెప్పకోవడమే గాని, మంత్రశక్తులు పూజ్యం. అందువల్లనే మూడవనేత్రం తెరిచి, బ్రిటిష్‌వారిని మలమల మాడ్చివెయ్యలేక, ముప్పై

సంవత్సరాలు సతమతమయ్యాడు. అంతవరకు దేనికి? నూట యిరవై సంవత్సరాలు బ్రతకాలనుకుని, ఆ సంకల్పమైనా నెరవేర్చుకోలేకపోయాడు. ఆయన తపశ్శక్తి వున్నవాడైతే, గోడ్సే కొన్ని యోజనాలలోకైనా రాగలిగేవాడా? ఒకవేళ వచ్చినా, అతడిచేతి పిస్తోలు ప్రేలేదా? ప్రేలితే, దానిగుళ్లు మెడలో గుళ్ళపేరు అయ్యేవి కావా? అట్టిదే తపోమహిమ! ఆ మహిమ సంపాదించినవాడు కాబట్టే, అగస్త్యుడు సప్త సముద్రాలను ఔపోసనం పట్టగలిగాడు; విశ్వామిత్రుడు సృష్టికి ప్రతిసృష్టి చేయగలిగాడు. జపతపాలు చేసినవారు కాకపోయినా, కేవలం పాతివ్రత్యమాహాత్మ్యంచేతనే సావిత్రి సత్యవంతుని బ్రతికించుకోగలిగింది; అనసూయ త్రిమూర్తులను చంటిపిల్లలను చేయగలిగింది; సుమతి సూర్యోదయాన్ని ఆపగలిగింది. వెనకటి కాల మంటే మజాకా అనుకున్నారా!

వెనకటికాలాన్ని గురించి ఈవిధంగా చెప్పుకుపోతే, దానికి అంతూ పంతూ వుండదు. రేడియో ఇప్పుడు వెలిసింది గాని వాల్వులు, కండెన్సర్‌లు, స్పీకర్‌లు వగైరా బెడద లేవీ లేకుండా పురాతనకాలంలో ఆకాశవాణి పలుకుతుండేది. ఇదేవిధంగా నేటి టెలివిజన్‌కు ప్రతిగా అప్పుడు దివ్యదృష్టి వుండేది. దానిద్వారా కేవలం జరుగుతున్నదే కాక, జరిగిపోయిందీ, జరగబోయేదీకూడా తెలిసేది. ఇప్పటి డకోటాలు,

వైకింగ్‌లు, స్కైమాస్టర్లు, కాన్‌స్టలేషన్‌లు మొదలైన వాటికి ప్రతిగా అప్పుడు పుష్పకవిమానం వుండేది. అయితే, దాని "పేటెంట్"ను ఒక్క కుబేరుడే ఎందుకు భుక్తపరుచుకున్నాడో తెలియదు. త్రిమూర్తులకు, వారి భార్యాబిడ్డలకు, దిక్పాలురకు ఎవరి వాహనాలు వారికి వుండనేవున్నవి. పైగా, తాము యావన్మంది ఖేచరశక్తిగలవారు. అంతగా అక్కరపడితే పుష్పకవిమానాన్ని అద్దె గిద్దె లేకుండా కుబేరుడు పంపనేపంపేవాడు. కాదు కూడదంటే రావణాసురుడు చేసినట్టు, నాలుగు తన్ని, దాన్ని కాస్తా ఊడబెరుక్కునే వారు. ఇందువల్లనే "నీ నోష్ఠనే పొద్దుపొడిచిందటయ్యా! నీ కొక్కడికే పుష్పకవిమానం ఎందుకు వుండాలి?" అని ఎవ్వరూ పోటీకి వచ్చివుండరు.

ఏ దృష్టినుంచి చూచినా, వెనకటిదే దివ్యమైనకాలం. ఇప్పటిది పిదపకాలం కాబట్టే, అన్నీ పిదపబుద్ధులు పుడుతున్నాయి. పోగాలం కాకపోతే, క్రాపింగులేమిటి చెప్పండి! గోష్పాదమంత జుట్టునైనా పిలకగా పెట్టుకోనకపోతే, వైతరిణీనదిలోనుంచి వొడ్డుకులాగడానికి విష్ణుదూతలకు ఉసులుంటుందా? వొడ్డువరకు వచ్చినతర్వాత పిలక పుచ్చుకుని పైకి లాగడంమాట అటుంచండి. గోదానాలు చెయ్యకపోతే, అసలు ఆ నదిని దాటడానికి ఆలంబన వుంటుందా? ముందడుగు వేస్తున్నామన్న భేషజమే ఇంతకీ మనలను

చెరుపుతున్నది. ఇప్పటికైనా మనం పారిశ్రామికాభివృద్ధి ప్రణాళికలకై ప్రాకులాట మాని, విద్యాలయాలకు, వైద్యాలయాలకు డబ్బు పారబొయ్యక, దేశాన్ని తపోవనాలతో నింపి వెయ్యాలి; గుళ్లూ, గోపురాలూ కట్టించాలి. యాగాలూ, యజ్ఞాలు చెయ్యాలి; పూజలూ, పురస్కారాలూ జరపాలి. వర్ణాశ్రమధర్మాలను పునరుద్ధరించాలి ; సనాతనధర్మాన్ని పునఃప్రతిష్ఠాపన చెయ్యాలి. కాకులుదూరని కారడవులకో, చీమలుదూరని చిట్టడవులకో వెళ్లి, ముక్కు మూసుకోగలవారు మూసుకోగా, మిగిలినవారికి రామనామమనే మిఠాయి పంచిపెట్టాలి. ఒక్కమాటలో, మంత్రయుగాన్ని తిరిగి ప్రవేశపెట్టాలి. అప్పుడుగాని ధర్మదేవత తన వెకిలిచేష్టలు మాని, తిరిగి నాలుగుకాళ్ళమీద నడవదు; అప్పుడుగాని తిరిగి రామరాజ్యం నెలకొనదు.





# కవిత, పాండితి

"చచ్చి చెడి, చాయంగల విన్నపాలు" అన్నంత పని జరిగినమీదట సంపాదించగలిగిన క్రీడాభిరామం ప్రతిని చదువుతుండగా కృతిపతి వంశవర్ణనలోనే ఒకచోట కొంత తికమకపడ్డాను. ఈ వర్ణన వివరిస్తున్నట్టు క్రీడాభిరామ కర్త వల్లభరాయుడేనా? అయితే, "మనుజమాత్రుండె వల్లభామాత్యవరుఁడు" అని తనను గురించి తానే గొప్ప చెప్పుకుంటాడా? తన వాగ్వైభవదాతృత్వాదివర్ణనకు కంద పద్యాష్టకాన్ని రచించుకొంటాడా? స్వాతిశయం కవికులంలో హెచ్చుగా కానవచ్చే జాడ్యమే అనుకోండి. స్వోత్కర్షను చేసుకోని కవులను వేళ్ళపై లెక్కించవచ్చు ననుకోండి. అయినా, "బస్తీమే సవాల్" అన్నట్టు మరీ ఇంతగా రొమ్ము విరుస్తారా? ఇంతగా జుట్టు విరబోసుకుంటారా? ఇంతగా కట్లు తెంచుకుంటారా? పోనీ, కవి ఎంతకైనా చెల్లునసే అనుకుందాము. అయినా, తానే తుమ్మి, తానే శతాయుసు అనుకున్నట్టు, తనను తానే ఆశీర్వదించుకోడుగదా? కాని, క్రీడాభిరామం "కాలభైరవుఁడు, శంభునిపట్టి సమగ్రవైభవాభ్యుదయపరంపరావిభవముల్ గృపసేయుఁ గవీంద్రకాంక్షిత

త్రిదశమహీరుహంబునకుఁ దిప్పయ వల్లభరాయమంత్రికిన్"
అనే పద్యంతో సమాప్తిచెందుతున్నది. ఈ అసంగతమే క్రీడాభిరామం వల్లభరాయని కృతికాదని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు బల్లగుద్ది చెప్పడానికి మొదటి కారణం. అయితే, వేటూరివారు శ్రీనాథునితరఫున వకాల్తా పుచ్చుకున్నారని, కవిసార్వభౌముని సహాయాన్ని క్రీడాభిరామకర్త ఏ కాస్తో కూస్తో పుచ్చుకున్నా, కృతిమాత్రం వల్లభరాయ స్వకపోలకల్పితమని వాదించే పండితోద్దండులు పెక్కురున్నారు. ఏమైనా, కృతికర్తృప్రశంసలోనే నన్ను కొంత అడ్డింది ఎన్నటికీ తెగని ఈ కర్తృత్వచర్చ కాదు.

క్రీడాభిరామం పన్నెండవ పద్యంలో "పన్నగాలంకార పన్నీరజధ్యాన సన్నుతాత్ముండు పోచన్న శౌరి" అనేది మూడవపాదం. "పన్నగాలంకారుడు" అంటే పాములే అలంకారాలుగాగల శివుడని తెలుస్తూనే వున్నది. ఆపిమ్మట "పన్నీరు" ప్రసక్తి ఎందుకు వచ్చిందనేదే నా ప్రాణానికి కొరకరానికొయ్య అయింది. "శబ్దరత్నాకరము" శరణుజొచ్చగా "హిమాంబువు" అని ముక్తసరిగా ఒకముక్క చెప్పి ఆపైన పలకలేదు, వులకలేదు. చల్లదనమివ్వవలసిన పన్నీరు బుర్రకు ఇలా వేడియెక్కిస్తున్నదేమని మథనపడుతుండగా, చిన్ననాడు హైస్కూల్‌లో తెలుగుపాఠాలు చెప్పిన పండితులొకరు చుట్టపుచూపుగా రావడం, "పత్ అంటే పాదాలు కావా?" అనడం తటస్థించింది. అప్పుడుగాని పన్నీరు ప్రసక్తి

ఇక్కడసలు లేదని, పత్ + నీర + జ పన్నీరజమని బోధ పడింది కాదు.

మన ప్రబంధకవు లంటే ఇందుకే నాకు మొదటినుంచీ తలనొప్పి. యతిప్రాసలపైన, యమకాలపైన చూపించే మోజులో పాతికో, పరకో మాత్రమే నిక్కువమైన కవిత మీద వీరు చూపిస్తారు. కొందరైతే యతిప్రాసలే, యమకాలే కవిత్వమని భ్రమపడతారు. శబ్దశ్లేషలు, అర్థశ్లేషలు, విభక్తిశ్లేషలకోసం శ్లేష్మంలోపడిన ఈగవలె తన్నుకులాడతారు. నాగబంధం, రథబంధం, చక్రబంధం, ఖడ్గబంధం, సౌధబంధం, కంకణబంధం, గోమూత్రబంధం మొదలైన వాటితో మనకు "ప్రాణబంధం" తెచ్చిపెడతారు. పద్యాన్ని చదువుతుంటే మేలుజాతి గుర్రం కదనుతొక్కినట్టుగా వుంటుంది. కాని, తీరా పసందుచెయ్యబోతే అది దాదాదండుగ కుంటి గుర్రమై చక్కా వూరుకుంటుంది. మచ్చుకు క్రీడాభిరామం కృతిపతి వంశవర్ణనలోని ఒక పద్యాన్నే చూడండి: "అంభోజభూభామారత్న పయోధర ద్వయతట ప్రాలంబ నైపథ్య ముక్తా మాణిక్య నిభాభిరూప్య పదవాక్య ప్రౌఢసాహిత్య విద్యా మాహాత్మ్య విలాస సమ్మోదిత విద్వన్మానసుండు"—కొండవీటి చేంతాడుతో పోటీచేస్తున్న ఈ సమాసంతో ఒక పద్యం దాదాపుగా సరి పెట్టబడింది. దీన్ని ఈకకు ఈక, తోకకు తోక లాగిచూస్తే తేలింది అతగాడెవడో మహామంచి మాటకారి అని

మాత్రం. ఈ భాగ్యానికి ఇంతగా మన ప్రాణం తియ్యడం దేనికి? మనకు కావలసినవి మాటలమూటలే అయితే, అమరకోశాలు లేవా, ఆంధ్రనామసంగ్రహాలు లేవా? కవిని నేను కోరేది తన సమాసాల వడగళ్ళతో నా తలను బొప్పి కట్టించమని కాదు; నా గుండెను కదిలించమనీ, నన్ను కరిగించమనీ. కవిత ధ్వని ప్రధానమైందని పెద్దలనడం నే నెరుగుదును. అయితే, వారు "ధ్వని" అన్నప్పుడు "స్ఫురణ"నే (సజెషన్) ఉద్దేశించారు కాని, పదాడంబరాన్ని కాదు; సమాసార్భటులనూ కాదు. తిక్కనామాత్యుని భారతంలో "దుర్వారోద్యమ బాహువిక్రమ రసాస్తోక ప్రతాపస్ఫుర ద్గర్వాంధప్రతివీర నిర్మథనవిద్యాపారగుల్ మత్పతుల్" అని తన అయిదుగురు భర్తల ప్రతాపాన్నిగురించి చెప్పి, ద్రౌపది కీచకుని బెదిరిస్తుంది. ఇక్కడ ఈ సమాసంలో ఎంతో ధ్వని వున్నదని కొందరు మెచ్చుకుంటారు. పిడుగుల పిండును పోలిన ఈ సమాసార్భటికి ద్రౌపదిపట్ల ఏ పాప చింతా లేని నాగుండే అవిసిపోతున్నది. ఇక, కీచకుడు హడలిపోవడం అబ్బురమా? ఏమైనా "పదాలపై నా అధికారం చూడు!" అనేది నామట్టుకు నాకు కవిత్వం కాదు; "నీ గుండెపై నా రాజ్యాన్ని చూడు" అని చెప్పగలిగిందే కవిత్వం.

కవిత మహాసున్నితమైన ప్రాణి. దానిపై పాండిత్యం బరువు పడితే, అది అప్పచ్చిలా నేలకు అంటుకుపోతుంది.

ఇందువల్లనే కావచ్చు, పాండితిని పెద్దపులిని చూచినట్లు చూచే జానపద గేయకర్తల అల్లిబిల్లి పదాలలోనే నాకు ఎక్కువ కవిత్వం కనబడుతుంది. "నితాంతదంతపీడనరట దాస్యరంగవికటభ్రుకుటీచటుల ప్రవృత్తనర్తనఘటనా ప్రకారభయదస్ఫురణాపరిణద్ధమూర్తియై" అని తిక్కన ఎంత సందర్భోచితంగా సమాసాన్ని విసిరాడో చూడండని, దీనిలో ఎంత కవిత్వం వుట్టిపడుతున్నదో గమనించండని పెద్ద లెవరైనా చెబితే, వారి పెద్దరికాన్ని కాదనలేక నేను తలవూచవచ్చుగాని, భీమసేనుని ఆవహించిన కోపాగ్నికి వెయ్యిరెట్లు తీవ్రతగల తుపాను కింగ్ లీర్ మనస్సులో చెలరేగడాన్ని షేక్స్పియర్ "బ్లో, విండ్స్, అండ్ క్రాక్ యువర్ చీక్స్! రేజ్, బ్లో!" మొదలైన పొడి మాటలతో వర్ణించ లేదా అని చప్పున జ్ఞాపకం వస్తుంది. తిక్కనార్యుడైనా "కడుఁ బసిబిడ్డ, వీఁ డొకటి గా దవు నా నెఱుఁగండు, ముందరెయ్యెడ నొకపా టెఱుంగఁ, డెద యెంతయుఁ గోమల, మెప్పుడైన నేఁ గుడువఁగ బిల్తుగాని తనకుంగల యాఁకటిప్రొద్దెఱుంగఁడు" అని కుంతీదేవి సహదేవుని ద్రౌపదికి "నిల్లడ వెట్టిన" సన్నివేశాన్ని ఇట్టి పొడి మాటలతోనే వర్ణించి గుండెను కరిగించలేదా అని కూడా జ్ఞప్తికి వస్తుంది.

ప్రబంధాలలో అక్కడొక పంక్తిలోను, ఇక్కడొక పద్యంలోను వెల్లుబికే కవిత్వం నాకు జానపద గేయాలలోని

ప్రత్యక్షరంలోను దివ్యదర్శన మిస్తుంది. ఒక మహాప్రబంధం నా కొక యెత్తు కాగా—

ఏరువా కొచ్చింది ఏరువాకమ్మ
ఏళ్లు నదులూ పొంగి వెంబడేవచ్చాయి
నల్ల మేఘాలలో నాట్యమాడింది
కొండ గట్టులమీద కులుకులాడింది
ఇసుకనదిలో దూరి బుసలుకొట్టింది
పాడుతూ కోయిలా పరువులెత్తింది
ఆడుతూ నెమలీ అలసిపోయింది
నవ్వుతూ మా అయ్య బువ్వ తిన్నాడు
ఏరువా కొచ్చింది ఏరువాకమ్మ
ఏళ్లు నదులూ పొంగి వెంబడేవచ్చాయి.

అనే చిన్న పాట ఒక్కటీ ఒక యెత్తు.

పెద్దనామాత్యుని మనుచరిత్ర తాళపత్ర గ్రంథరూపంలో వుండగా చెద పట్టిపోయి మనకు దక్కకుండాపోయినా నేను శోకించి వుండేవాడిని కాను గాని, తొలకరికి పడుచుపిల్ల—

తొలకరి ఒక మబ్బు తొంగిచూచింది
మబ్బులో ఒక మెరపు మెరసిపోయింది
పెరటిలో ఒక జల్లు కురిసి వెలిసింది
ఏ కొమ్మమీదనో ఎండతాకిన పిట్ట
ఏటిత్రోవలు పట్టి ఎగిరిపోయింది
ఏరువాక నాటి కేడాది దాటింది
ఎగురుచూచి గుండె చెదరిపోయింది
పిట్టా పిట్టా ముద్దు పెట్టుకున్నాయి

గోవులన్నీ యిల్లు జేరుకున్నాయి
ఏటిగాలికి చిలుక లెగిరిపోయాయి
ఎందుకో నా ఆశ లెగిరిపోయాయి.

అని బావను తలచుకొని పాడుకునే పాట కాలగర్భంలో కలిసిపోతే మాత్రం ఎంతో విచారపడేవాడిని.

పోనీ, నామాట కేమి లెండి! మీమాటే చెప్పండి. విరహిణి వరూథిని—

ఓ చెల్ల! విరహిణీవధ
మే చతురత నీకు? దురితమే చేయు పనుల్
రాచరికపు ఫలమే య
య్యో చంద్ర? వివేకమెఱుఁగవో కొ గురుసేవన్.

అని చేసిన చంద్రనిందలో ఎక్కువ కవిత్వం వున్నదంటారా? లేక, ఏ అజ్ఞాత జానపద మహాకవో సృష్టించిన ముగ్ధ—

నవ్వుతూ మాటాడి
కవ్వించిపోయాడు—చందమామోయి;
నవ్వులో నే మనసు
నను విడిచిపోయింది—చందమామోయి.

అని చంద్రునికి పెట్టుకున్న మొరలో ఎక్కువ కవిత్వం వున్నదంటారా?

పండితకవులను నిరసిస్తున్నావని, డొక్కశుద్ధిలేనివాడవని కొందరు నన్ను నిందించినా మాబాగేగాని, జోలపాటలలోను, రోకటిపాటలలోను, ఇతర జానపదగేయాలలోను కనబడే కవిత్వంలో నూరోవంతైనా ప్రబంధాలలో నాకు పొడగట్టదు. కవితాపాండిత్యాలలో కలకాలానికీ కవితకే నా వోటు.



# గడ్డాలసొగసులు

ఒక్క గంటలో ముగ్గురో, నలుగురో వరసగా అడిగారు: "సుస్తీగా వున్నదా?" అని. సుస్తి లేదు, పాడూ లేదు. ముక్కున పడిసెమైనా లేదు. తత్త్వతః ఆరోగ్యం అంతంత మాత్రమే అనుకోండి. తరచు మంచం పట్టడంకూడా కద్దు. కాని, ఇవ్వాళమాత్రం ఏరోగం, రొష్టూ లేకుండా పీటకోడు చెక్కలానే వున్నాను. అయినా, "సుస్తి చేసిందా?" అని ఇందరు అడగడానికి కారణం లేకపోలేదు. గడ్డం బాగా మాసింది. చెక్కిళ్లను నిమురుకుంటే కంబళిపై చెయ్యి వేసినట్టుగా వున్నది. నాలుగురోజులు గడ్డాన్ని మాయనిస్తే వారం రోజులు ఖాయలాపడి లేచినవారిలా చాలామంది కనబడతారు. ఈ చాలామందిలో నే నొకడిని.

నిజమే, గడ్డం మాస్తే అసలు బ్రతుకే మాసినట్టుగా వుంటుంది; రోగిష్ఠి కళ ఏర్పడుతుంది. కాని, "సుస్తి చేసిందా?" అనే పరామర్శలకు తట్టుకుని, "తిరుపతి మొక్కుబడి వున్నదా?" అనే ప్రశ్నలకు విసువు చెందకుండా, "ఆవిడకు నెల తప్పిందా?" అనే పరిహాసాలను

చెవిని పెట్టక, గడ్డాన్ని పూర్తిగా పెరగనిస్తే పెద్దరికం వస్తుందనే నా నమ్మకం. గడ్డానికీ, గొప్పతనానికీ ఏదో సంబంధం వున్నట్టే తోస్తుంది. గడ్డం పెంచినవారందరు గొప్పవారు కారనుకోండి. కాని, గొప్పవారిలో చాలామంది గడ్డాలవారు. మన మహర్షులలో జనశ్రుతి ప్రకారం గడ్డం లేనివాడు ఒక్క నారదుడే. ఆయన నిత్య యౌవనుడు. బ్రహ్మకల్పంవరకు "అడ్డాలవాడు"గా వుండేవాడు కనుక, అయన గడ్డాలవాడు కాడు; కానేరడు. మహర్షులను విడిచి, మహాత్ములను చూడబోతే వారిలోనూ గడ్డంలేనిది బుద్ధ భగవానుడు, గాంధి మహాత్ముడు మాత్రమే నేమో! మన మహాకవులలో వాల్మీకి, వేదవ్యాసులు ముందు ఋషులు, తర్వాతే కవులు. అందువల్ల వారు గడ్డాలవారేనని ఢంకా బజాయించి మరీ చెప్పవచ్చు. తక్కినవారి విషయమే అనుమానం. అశ్వఘోషుడు బౌద్ధుడు. ఆయనకు గడ్డం వుండడానికి వీలే లేదు. నిత్యయౌవనానికి సంబంధించినంత వరకు నారదుని మరపించగల కాళిదాసు, దివ్యమంగళ మూర్తికి చూస్తూ చూస్తూ గడ్డాన్ని తగిలించలేము. భాస, భవభూతి, సౌమిల్లాదులకు కూడా గడ్డాలను తగిలించడం కష్టమే. మన నన్నయ, తిక్కన, పోతన, పెద్దన మొదలగు వారు వైదికకర్మనిష్ఠాగరిష్ఠులు కనుక, వారికి గడ్డా లుండేవి కావనే అనుకోవాలి. వాల్మీకి, వేదవ్యాసుల తర్వాత మన

దేశంలో గడ్డంపెంచిన మహాకవి ఒక్క రవీంద్రనాథ టాగోరే కావచ్చు, కాని, విదేశాలకు చెందిన మహాకవులలో హెచ్చుమంది మాత్రం గడ్డాలవారే. ముఖ్యంగా గ్రీక్, రోమన్, ఫ్రెంచి, ఇంగ్లీషు, స్పానిష్, రష్యన్, చైనీస్ కవులు. సందేహం లేదు—ప్రపంచ మహాపురుషు లందరినీ లెక్కకడితే వారిలో గడ్డాలవారిదే మెజారిటీ.

గడ్డాలవారందరు గొప్పవారు కాకపోయినా గొప్పవారిలో హెచ్చుమంది గడ్డాలవారు కాబట్టి, వారి ఘనతను పంచుకో డానికి గడ్డాన్ని పెంచుకుందామని అప్పుడప్పుడు నాకు అనిపిస్తూ వుంటుంది. కాని, గుండె నిబ్బరం చాలదు. తీరా గడ్డాన్ని పెంచితే, అది ఏ రకమైంది కాబోతుందో అని కొంత బెరుకు కూడా వుంటుంది. పిల్లిగడ్డం, పీచుగడ్డం, మేకగడ్డం, దుబ్బుగడ్డం, బవిరిగడ్డం, నల్లగడ్డం, రాగిగడ్డం, తెల్లగడ్డం, పొట్టిగడ్డం, పొడుగుగడ్డం—ఈ విధంగా పరిమాణ వర్ణాకృతి విశేషాలను బట్టి ఎన్నో రకా లున్నాయి. వీటిలో మొదటి రెండూ చెడ్డ వికారంగా వుంటాయి. మేక గడ్డం కొన్ని ముఖాలకు — ముఖ్యంగా కోలముఖాలకు — అందంగానే వుంటుంది. దుబ్బుగడ్డం, బవిరిగడ్డం మొత్తంపై కొట్టి వచ్చినట్టుగా వుంటాయి. తక్కినవాటిని గురించి కచ్చితంగా ఏమీ చెప్పలేము. ఏమైనా, గడ్డం అందచందాలు దాన్ని పెంచేవారి ముఖకవళికలపైన, వారి గుణగణాలపైన

ఎక్కువగా ఆధారపడివుంటాయి. ముఖంలో తీరు, నడతలో తీవి లేకపోతే, గడ్డం అతికించినట్టుగానైనా వుంటుంది; అంద వికారంగానైనా వుంటుంది.

కన్‌ఫ్యూషియస్ గడ్డాన్ని చూడండి. అది అంత పెద్దది కాక, బొత్తిగా చిన్నది కాక, ఆయన బోధించిన మధ్యమ మార్గాన్ని ("గోల్డెన్ మీన్") అనుసరించి వుంటుంది. ఇంగ్లీషు కవిత్వానికి మొలకవేసినవాడు కాబట్టే కావచ్చు, ఛాసర్ గడ్డం మొలిచీ మొలవనట్టు వుంటుంది. మహాశిల్పి, స్థపతి, చిత్రకారుడు మాత్రమే కాక, రోలింగ్ మిల్లు, రోలర్ బేరింగులు, పైల్ డ్రయివర్, స్టీమ్ యింజన్ మొదలైనవాటిని శతాబ్దాలనాడే సృష్టించిన బహుముఖ ప్రజ్ఞానిధి కాబట్టే కావచ్చు, లియొనార్డో డవించె గడ్డంలో భావశబలత కనబడుతుంది. తరచిన కొద్దీ ఆయన నాటకాలలో కనబడ్డట్టే, చూచినకొద్దీ షేక్స్‌పియర్ గడ్డంలో సొగసులు కనబడతాయి. మంత్రాంగంలో మేటి, కార్డినల్ రిష్లూ, బుద్ధినిశితత్వం ఆయన గడ్డంకొసగుండా తొంగి చూస్తూ వుంటుంది. సృష్టిక్రమాన్నిగురించి మహా విప్లవకరమైన సిద్ధాంతాన్ని ప్రతిపాదించినవాడైనా నలుగురిలో నిలవడానికే బిడియపడేవాడు కనుక, ఛార్లెస్ డార్విన్ గడ్డం ముఖాన్ని కమ్మివేయడానికే ఉద్దేశించబడినట్టు వుంటుంది. కార్ల్ మార్క్సుగడ్డం ఆయనవలె "తిరగబడండి" అని

రంకె వేస్తున్నట్టు వుంటుంది. అబ్రహాం లింకన్ గడ్డం దున్నిన చేనువలె వుండే ఆయన ముఖానికీ, ఆడంబర మెరుగని ఆయన ప్రవృత్తికీ తగినట్టుగా వుంటుంది. టాల్‌స్టాయ్ గడ్డం ఆయన తలపులవలె ఎంతో ఏపుగలది. కొంతవరకు టాల్‌స్టాయ్ గడ్డాన్ని పోలిందే బెర్నార్డ్ షా గడ్డం. లెనిన్ కంటి తళుకుకు ఆయన గడ్డంబెళుకు ఎంతో అందాన్ని తెస్తుంటుంది. ట్రాట్‌స్కీది మేకగడ్డం. మేకదాట్లు వేయగల ఆయన చిత్తవృత్తికి అది తగిందే. మన అరవిందయోగిది కూడా మేకగడ్డం. కాని, నా కంటికి అది అతికించినదానిలానే కనబడుతుంది.

గడ్డాల సొగసుకు మార్కులివ్వమంటే నేను ఫస్టుమార్కు టాగోర్‌కే యిస్తాను. ఏ వయస్సుకుతగు గడ్డాన్ని ఆ వయస్సులో ఆయన పెంచాడు. ఎప్పటికప్పుడు అది ఆయనకు సొగసు నిచ్చింది, ఠీవి నిచ్చింది. బెర్నార్డ్ షా అంతటివాడు టాగోర్ గడ్డాన్నిచూచి రవ్వంత అసూయపడ్డాడు. అంతటి చక్కని గడ్డాన్ని తా నెన్నడూ చూచివుండలేదన్నాడు. సిలాలవలె నిగనిగలాడుతూ పట్టుకుచ్చులావున్న ఆయన గడ్డాన్ని (ఇది రవీంద్రుడు వయస్సులో నున్నప్పటిమాట అయివుండాలి) నిమిరిచూడాలని తనకు బుద్ధి పుట్టినట్టు చెప్పాడు. గడ్డాలవిషయమై షా "అథారిటీ". గడ్డంవుంటే ముఖానికి విషవాయు ప్రమాదనివారణ కవచాన్ని తగిలించు

కోవడం కష్టమని యుద్ధసమయంలో ఆయన కొకరు సలహా చెప్పగా, విషవాయువులకు చావనైనా చస్తానుగాని, గడ్డాన్ని గొరిగించ నన్నాడు. మొన్న కాలువిరగగొట్టు కున్నప్పుడు ఆపరేషన్ సందర్భంలో గడ్డంవుండగా మత్తు మందు పుచ్చుకోవడం కష్టమంటే, అయితే ఆపరేషనే వద్దు పొమ్మన్నాడు. తొంభై దాటినా ఇప్పటికీ ప్రతిరోజూ పక్కా అరగంట అద్దంముందు నిలబడి, మీసాలను, గడ్డాలను, చివరికి కనుబొమలనుకూడా దువ్వుతాడు. ఆసుపత్రిలో వుండగా నలిగిపోయిందని ఇంటికి చేరగానే మీసాల, గడ్డాల పోషణను ఆయన తిరిగి ప్రారంభించేవుండాలి. *

గడ్డంతత్త్వం తెలియకనే అనుకుంటాను, మన నాటకాలలోను, సినిమాలలోను మహర్షు లందరికీ బవిరిగడ్డాలనే తగిలిస్తారు. ఇది శుద్ధ తప్పు. బవిరిగడ్డం వశిష్ఠ, బృహస్పతులకే తగు. సృష్టికి ప్రతిసృష్టిచేయడానికి ప్రయత్నించిన లెనిన్‌కు తాతగానో, ముత్తాతగానో యెన్నదగువాడు కనుక విశ్వామిత్రునికి లెనిన్ గడ్డాన్ని పోలినదాన్ని పెట్టాలి. దూర్వాసుడికి పెట్టే గడ్డం కణకణ మండే చింతనిప్పులవలె ఎర్రనిదై వుండాలి. అగస్త్యునిది జెంఘిస్‌ఖాన్ గడ్డం వంటిది కావాలి. పిచ్చుకలు గూళ్లు పెట్టుకోడానికి పనికిరాగల గడ్డమే వేదవ్యాసునికి తగు. వాల్మీకికి తగుపడేది టాగోర్ గడ్డం.

---

* ఈ వ్యాసరచన జరిగింది బెర్నార్డ్ షా కాలధర్మానికి కొంచెం ముందుగా.

ఇతరులకు ఏయే గడ్డం తగునో తేలికగానే చెప్పివేస్తున్నా, నాకు తగు గడ్డాన్ని గురించి మాత్రం నాకు అన్నీ సందేహాలే. ఇంతకీ గడ్డాన్ని పెంచాలంటే కొంత సాహసమే కాక, దానిపట్ల ప్రేమ వాత్సల్యాలు కావాలి, భక్తి శ్రద్ధలు కావాలి. పసిపాపను మించి దాని పోషణ చెయ్యాలి; ప్రేయసిని మించి దాన్ని ప్రేమించాలి; గురువును మించి గౌరవించాలి. పదహారవ శతాబ్దపు బ్రిటిష్ తత్త్వవేత్త, రాజనీతివిదురుడు సర్ థామస్ మోర్‌పై రాజద్రోహ నేరాన్ని మోపి, శిరచ్ఛేదానికి వధ్యస్థలానికి తీసుకువెళ్లగా, "నా గడ్డం ఏమి పాపాన్ని చేసిందయ్యా! దాన్ని తొలగించే వరకు కాస్త నిదానించండి" అని ఆయన అన్నాడట. గడ్డం విషయమై ఇంతటి భక్త్యభిమానాలు లేనందునే "సుస్తీ చేసిందా?" అని వరసగా ముగ్గురో, నలుగురో నన్నడిగే సరికి నా సేఫ్టీ రేజర్‌కు పని చెప్పాను.





# ఒక నిట్టూర్పు

హ్యామిష్ హ్యామిల్టన్ కంపెనీ లండన్‌నుంచి పంపిన పుస్తకాల కేటలాగ్ ప్రొద్దున పోస్టులో వచ్చింది. దాన్ని కాసేపు తిరగవేసి, ఒక నిట్టూర్పుతో అవతల పెట్టాను.

ఒక్కొక్కరు ఒక్కొక్క కారణానికి నిట్టూరుస్తారు. ఒక్కరే వేర్వేరు సమయాలలో వేర్వేరు కారణాలకు నిట్టూరుస్తారు. ఏవైనా కష్టాలు చుట్టుకుంటే నిట్టూర్పు; వాటినుంచి బయటపడితే నిట్టూర్పు. ఏదైనా బాధకలిగితే నిట్టూర్పు; అది ఉపశమిస్తే నిట్టూర్పు. ఏ ప్రమాదమైనా కలుగుతుందని భయం తోస్తే నిట్టూర్పు; ఆ భయం నిరాధారమైందని తేలిపోతే నిట్టూర్పు. మొత్తంమీద గుండె బరువుకు, నిట్టూర్పుకు చాలా లంకె వున్నదని చెప్పాలి. గుండె బరువెక్కినా, ఆ బరువు తగ్గినా, రెండింటికీ ఒక్కటే సిగ్నల్. అది.—నిట్టూర్పు. కాని, "ఎయిర్ రెయిడ్ వార్నింగ్"కు, "ఆల్-క్లియర్ సిగ్నల్"కు వున్నట్టు స్థాయీభేదం కొంత వుంటుంది.

నిట్టూర్పుకు కారణాలు నానావిధాలైనా మన కవులు, ముఖ్యంగా ప్రబంధకవులు, దానికి తరచు విరహవేదనతోనే లంకె పెడతారు. విరహావస్థలో పడినవారికి హారం భార మవుతుందట; ఆహారం కారమవుతుందట; మందమారుతం మహాతాపాన్ని కలిగిస్తుందట; పండు వెన్నెల కేవలం నిప్పుల్ని చెరుగుతుందట. ఈ ఘోర తాపోద్వేగాన్ని భరించ లేక మూర్ఛిల్లిపోతారట. అప్పుడు తామరతూండ్లతోను, ఎర్ర కలువలతోను, పన్నీటితోను, పచ్చకర్పూరం కలిపిన పల్చని గంధంతోను శైత్యోపచారాలు చెయ్యాలట. మూర్ఛ మునిగే విరహులు ఆ ఘట్టానికి పూర్వోత్తర భాగాలలో ఏకధాటిగా నిట్టూరుస్తారట.

ఏకధాటిగా కాకపోయినా, నిగుడ్చిన ఒక నిట్టూర్పును నేను పెద్దగానే నిగుడ్చాను. అయితే, విరహవేదనతో నా నిట్టూర్పుకు ఎంతమాత్రం సంబంధం లేదు సుమండీ! నాకు కలిగింది వేరొక వేదన. దాన్ని ఒక వేదనగా చాలామంది అసలు అంగీకరించకపోవచ్చు. హీనపక్షం ఒక చిక్కుగా నైనా అది వారి అంగీకృతిని పొందకపోవచ్చు. రేషన్ బియ్యం దొరక్కపోవడం, రేసులలో డబ్బు పోగొట్టు కోవడం, అప్పులు మోపుకావడం, అద్దెకు కొంప దొరక్క పోవడం, సినిమా టిక్కెట్టు అందకపోవడం, సేఫ్టీ రేజర్ బ్లేడ్లు కరువుకావడం మొదలైనవాటిని తప్ప, మరొక దాన్ని చిక్కుగా ఈనాడు బహుళజనులు ఒప్పకపోవచ్చు.

అందుకే నా నిట్టూర్పు కారణాన్ని బయటపెట్టడానికి తట పటాయిస్తున్నాను.

ప్రొద్దుటిపోస్టు నాకు తెచ్చిన కేటలాగ్ మొదటి పేజీలో "వరల్డ్ విదిన్ వరల్డ్" అనే పేరుతో స్టీఫెన్ స్పెండర్ కొత్తగా వ్రాసి ప్రచురించిన ఆత్మకథకు సంబంధించిన భోగట్టా వున్నది. ఆత్మకథ సాధారణంగా ఆత్మీయుల కథలతో—పితృ, పితామహ, ప్రపితామహ కథలతో—ప్రారంభమౌతుంది. ఎలాగో ఈ వంశవృక్ష మహారణ్యాలను ఛేదించుకుని బయటపడేసరికి, కృతికర్త జనన, శైశవ, కౌమార, యౌవనాది వివిధావస్థల మహాయెడారులలో చిక్కుకుని తిరిగి దారి తప్పుతాము. వ్యక్తులైన తర్వాత ఎవరేమి చేశారనేదే ఆత్మకథలను చదవడంలో మనం ఎక్కువగా తెలుసుకోనగోరేది. అయినా, ఆ ఘట్టానికి రాక ముందే పుస్తకంలో దాదాపు సగమైనా సరిపెట్టబడుతుంది. అప్పటికే విసుగుపుడితే మిగతా సగాన్ని మనం చదివేదే లేదు. ఆత్మకథ వ్రాస్తున్న వ్యక్తి మహాపురుషుడైతే, ఈ ప్రమాదం రాదనుకోండి. కీర్తికెక్కిన నాటినుంచీ అట్టి వ్యక్తి జీవితం మనకు తెలిసేవుంటుంది. అందువల్ల ఆయన విషయంలో ప్రఖ్యాతికి రాకపూర్వపు విశేషాలనే మనం తెలుసుకోగోరతాము. ఈ విషయాన్ని గుర్తించే కావచ్చు, గాంధీజీ తన ఆత్మకథను 1921 తో ఆపివేశాడు. ఆ తర్వాత

తన జీవితం లోకైకవేద్యం గనుక తాను ప్రత్యేకించి వ్రాయవలసింది లేదన్నాడు.

కాని, ఆత్మకథలను వ్రాసేవా రందరు మహాపురుషులు కారు. అట్టివారి పుట్టుపూర్వాలను గురించి మనం శ్రద్ధ తీసుకోడానికి ముందు వారినిగురించి మనకు శ్రద్ధ యేర్పడాలి. స్టీఫెన్ స్పెండర్ ఈ కిటుకు గ్రహించి, తన జీవితగాథను కొననుంచి మొనకు వ్రాశాడట. ఆయన మరొక కొత్తపోకడ కూడా పోయాడట. ఆత్మకథలలోని జననం, శైశవం, విద్యాభ్యాసం, వివాహాది ప్రకరణ విభాగానికి స్వస్తిచెప్పి, స్నేహం, ప్రేమ, కవిత, రాజకీయాలు, నానాదేశ సందర్శనం మొదలైన శీర్షికలకింద తన జీవితచరిత్రను వివరించాడట. ఇంతగా కొత్తఫక్కీలో నడవడమే కాక, ఈ ఆత్మకథలో వర్జీనియా వుల్ఫ్, టి. యస్. ఇలియెట్, లేడీ మోరెల్, డబ్లియు. హెచ్. ఆడెన్, క్రిస్టఫర్ ఐషర్వుడ్ మొదలైన సుప్రసిద్ధ ఆధునిక రచయితల "మూర్తి కల్పనలు" కలవట. ఈ పుస్తకాన్ని కొని చదవడం ఎప్పుడెప్పుడా అని మనస్సు రెపరెపలాడింది.

మహోత్సుకతతో కూడిన ఈ మనస్సుతో కేటలాగ్ మొదటి పేజీని తిప్పివేసి రెండవదాన్ని చూచాను. దానిలో ప్రెసిడెంట్ రూజ్‌వెల్ట్‌నుగురించి జాన్ గంథర్ వ్రాసిన పుస్తకం ప్రశంస కానవచ్చింది. గంథర్ పుస్తకాల ప్రాశ

స్త్వాన్ని కొత్తగా నాకు వివరించనక్కరలేదు. ఆయన "ఇన్‌సైడ్" పుస్తకాలన్నీ నేను చదివినవే. సూక్ష్మంలో మోక్షాన్ని చూపించడంలో, మోక్షాన్ని సూక్ష్మంలో యిమడ్చడంలో ఆయనకు ఆయనే సాటి. అందువల్లనే యూరప్, ఆసియా, లాటిన్ అమెరికా, యునైటెడ్‌స్టేట్సులను పోలిన మహాఖండాల అసంఖ్యాక సమస్యలను అయిదారేసి వందల పేజీలలోకి కుదించగలిగాడు. పైగా, ఆయన జనాభా లెక్కలలో కవిత్వం చూపిస్తాడు; ఎగుమతి, దిగుమతుల మదింపులలో సంగీతం పలికిస్తాడు; పన్నుల, సుంకాల గుణకారాలలో రసం వొలికిస్తాడు. దేశనాయకులను గురించి సమ్మోహనంగా వ్రాస్తూ, దేశసమస్యలను విప్పిచెప్పడాన్ని ఒక కళగా తీర్చిదిద్దాడు. ఆయన ఒక ఖండాన్నిగురించి వ్రాసిన పుస్తకాన్ని చదవడం ఆ ఖండంలో ఏడాదో, రెండేళ్ళో పర్యటన చేసివచ్చిన దానితో సమానం.

పైగా, ఈసారి గంథర్ వ్రాసింది ప్రెసిడెంట్ రూజ్‌వెల్ట్‌ను గురించి. ఈ యుగం మహాపురుషులలో ఫ్రాన్క్లిన్ డెలానో రూజ్‌వెల్ట్ తప్పక గణనకు వస్తాడనడం నిర్వివాదం. పుట్టుకతోనే కాకపోయినా, పసితనంలోనే రూజ్‌వెల్ట్ అవిటివా డైపోయాడు. ఆయనకు వచ్చిన బాలారిష్టం పక్షవాతం. విధి చూచిన ఈ క్రూరపుచూపు తర్వాత సామాన్యుడైతే సోదెలోకైనా రాకుండాపోయేవాడే. అసామాన్యు

డైనందునే జీవితారంభంలో ఇంత ఘోరపు దెబ్బ తినీ రూజ్‌వెల్ట్ పైకివచ్చాడు. నాల్గవ పర్యాయం వైట్ హౌస్‌లో ప్రవేశించి, నాలుగేళ్ళూ నిండకుండానే వెళ్ళిపోయాడుగాని, మరి నాలుగు పర్యాయాలు ప్రెసిడెంట్ పదవికి పోటీచేసినా, ఆయనకు బహుశా తిరుగువుండేది కాదు. ఆయనపట్ల ప్రజల అనురాగం అంతటిదే! ఆయనలో ఏదో వశీకరణశక్తి వున్నట్టు, ప్రబల విరోధులైనా సముఖంలో సాధువులైపోయే వారు; దుయ్యబట్టడానికి వచ్చి, దణ్ణంపెట్టి వెళ్ళిపోయేవారు. కావడానికి ఆయన కేపిటలిస్ట్ వ్యవస్థా సంరక్షకుడు. అయినా, కేపిటలిజం కోరలు పెరికివేయడానికి ప్రయత్నించాడు. రూకలున్నవానిదే రాజ్యమైన దేశంలోనైనా కాసుకు గతి లేనివాడు కూడు గుడ్డలకు మొగం వాచి, మలమల మాడి, కటికచావు చావనక్కరలేదని తన "న్యూ డీల్" ద్వారా నిరూపించడానికి కృషిచేశాడు. ద్వితీయ ప్రపంచ సంగ్రామ సందర్భంలో తన చతుస్సూత్ర స్వాతంత్ర్య ప్రణాళికలో "క్షుధార్తినుంచి విముక్తిని" కూడా చేర్చాడు. నిస్సందేహంగా రూజ్‌వెల్ట్ మహాపురుషుడే. కాని, ఆయనకు చరిత్రలో లభించే స్థానం ఎవరి సరసను? గాంధీ, లెనిన్‌ల సరసనా? చర్చిల్, స్టాలిన్‌ల సరసనా? అమెరికా ప్రెసిడెంట్‌లలో ఆయన జార్జి వాషింగ్టన్, అబ్రహాం లింకన్‌ల కోవలో చేరగలడా? లేక, ఒక మెట్టు కిందనే వుండిపోగలడా? సమకాలికులు సమకాలికులకు విలువకట్టడం

కష్టం. ఆ సమకాలికులు విలక్షణులైతే, ఆ పని మరింత కష్టం. కనుక ప్రపంచచరిత్రలో రూజ్‌వెల్ట్ స్థానాన్ని భావి చరిత్రకారుడుతప్ప నిర్ణయించలేడేమో? అయినా, రూజ్‌వెల్ట్ జీవితంపై గంథర్ ఏమి తీర్పుచెప్పాడో తెలుసుకోవలసిందే. ఈ పుస్తకాన్నికూడా తప్పక కొని చదవాలని తొందరపడుతూ కేటలాగు మూడవపేజీపైకి కన్ను పోనిచ్చాను.

ఫ్రెంచి నవలా సాహిత్యాన్ని సమీక్షచేసే పుస్తకమొకటి కొత్తగా వెలువడిందన్న కబురు ఆ పేజీ అందజేసింది. నూతన దృక్పథంనుంచి స్టెండాల్, బాల్జాక్, ఫ్లోబెర్, ప్రూస్ట్ మొదలైన ఏడుగురి రచనల సమగ్రపరిశీలన ఈ గ్రంథంలో కలదట. ఈ నవలాకారులలో కొందరు నాకు పరిచితులే. ఒకసారి పరిచయమైనతర్వాత యేళ్లూ, పూళ్లూ గడిచినా వీరు మరి మరపురానివారు. వీరిలో పెద్ద తలకాయ స్టెండాల్. అయితే, అది మారుపేరు. తల్లిదండ్రులుపెట్టిన అసలు పేరు హెన్రీ బెయిల్. రాతకోతలకు మారుపేరుగా "స్టెండాల్" అని ఒక చిన్నపట్టణం పేరు తగిలించుకున్నాడు. "లాటరీలో నేనొక టిక్కెట్టు కొనుక్కున్నాను. దానికి పెద్దబహుమానం రాబోతున్నది: అదేమిటంటే, 1935లో నాపుస్తకాలకోసం ప్రపంచం విరగబడ్డం" అని ఆయన నూరేళ్ళక్రితం చెప్పుకున్నాడు. ఆ ప్రకారమే నూరేళ్ళ నాడులేని ఖ్యాతి ఈనాడు ఆయనకు అబ్బింది. ఆయనను

మించిన నవలాకారుడు ఫ్రెంచివారిలో మరి లేడని సర్వే సర్వత్రా పోయిన పది, పదిహేను సంవత్సరాలలోనే గుర్తించబడింది.

స్టెండాల్ ఇటీవల తన అగ్రతాంబూలాన్ని తన్నుకు పోయినా, బాల్జాక్ పైనా అసామాన్యుడే. దేశదేశాల నవలాకారులలో హేమాహేమీలే ఆయన రచనలను చూచి వరవడిపెట్టుకున్న కాలం వున్నది. ఆయన రచనల కంటెకూడా ఆయన జీవితం నన్ను ఎక్కువగా ఆకర్షిస్తుంది. న్యాయవాదివృత్తికి శిక్షణ పొందికూడా దానిలో ససేమిరా చేరనన్నాడు. గ్రంథకర్తగా రాణించడానికి పదేళ్ళు అష్టకష్టాలు పడ్డాడు. పేరు ప్రఖ్యాతులు రావడంతో పాత కష్టాలన్నీ తీరినవనుకుంటే, సులభ ద్రవ్యార్జన ప్రలోభానికి లోనై "స్పెక్యులేషన్"కు దిగాడు. అందులో వచ్చిన నష్టాలను పూడ్చుకోవాలని గ్రంథముద్రణ, ప్రచురణ మొదలైన వ్యాపారాలలో వేలుపెట్టి మరింత అప్పుల పాలయ్యాడు. ఆయన జీవితమే ఒక చిత్రకథ.

ఫ్లోబెరైనా దిగ్గజంలాంటివాడే. రచనలో సన్నపోగారు పనితనం ఎక్కువగా చూపించేవాడు కనుక, ఇప్పటివారు ఆయన కవిబ్రహ్మ కాడని, విశ్వకర్మ మాత్రమేనని పెదవి విరుస్తారు గాని, ఫ్లోబెర్ సృష్టించిన "మదాం బోవరీ" మానసికశాస్త్రం పాఠాన్ని చూచినవారికే వెలుగుదారి

చూపించింది. ఇట్టి మహారచయితలను గురించిన పుస్తకాన్ని కొనక పోవడమేమిటి? చదవక పోవడమేమిటి?

సరే, ఆ పేజీని ముగించి, మరొకదానికి వెడుతుండగా "అప్పో, సప్పో చేసి, ఈ పుస్తకాలన్నింటిని కొన్నా, వీటి నన్నింటిని చదవగలనా" అని సందేహం తోచింది. ఈమధ్య కొన్న ఒక గంథర్ పుస్తకాన్ని ("ఇన్‌సైడ్ ది ఐరన్ కర్టెన్") అక్కడక్కడ తిరగవేయడమే తప్ప ఆసాంతం చదవనేలేదని గుర్తుకు వచ్చింది. స్టెండాల్, బాల్జాక్, ఫ్లోబెర్ నవలలలో ఇంకా విప్పిచూడనివి నాపుస్తకాల బీరువాలలోనుంచి నిర్లక్ష్యాన్ని సహించలేక బాధకొద్దీ మూలుగుతున్నట్టు వినబడింది. చదవాలనీ, తెలుసుకోవాలనీ అంతులేని ఆసక్తే తప్ప అందుకు తగు విరామం ఈ జీవితానికెక్కడిదని నిస్పృహ తోచింది. ఆ నిస్పృహనుంచి వెలువడిందే నా నిట్టూర్పు!



# కట్టు కథలు



పదుగురినోట పడ్డానికే మరొకపేరు—ప్రతీతి. "నా సంగతి లోకానికి ఎందుకు పట్టాలి?" అని గుణిసేవాడు ప్రతీతి కెక్కలేడు; ప్రతీతి కెక్కినవానినిగురించి లోకం మంచో, చెడ్డో చెప్పుకోకనూ మానదు. మంచిచెప్పుకుంటే అది సత్కీర్తి; చెడ్డ చెప్పుకుంటే దుష్కీర్తి. కీర్తికామి తననుగురించి లోకం ఏమి చెప్పుకుంటున్నదో అని కలత పడకూడదు. అతడు ఆందోళన చెందవలసింది తన ఊసే ఎక్కడా వినిపించనప్పుడే. "లోకం నిన్ను దూషిస్తున్నదా, భూషిస్తున్నదా అనేది ముఖ్యంకాదు; నిన్నుగురించి చర్చిస్తున్నదా, లేదా అనేది ముఖ్యం" అని చర్చిల్ ఒకప్పుడు చెప్పిన ముక్క ప్రతీతికై ప్రాకులాడే ప్రతివ్యక్తీ మననం చేసుకోదగింది.

నలుగురినోట పేరు నలగడం ప్రారంభించిన తర్వాత మంచీ చెడ్డా రెండూకూడా వినవలసి వస్తుంది. "ఎంత మంచి గొల్లకైనా వేపకాయంత వెర్రి వుంటుంది" అనే సామెత కేవలం యాదవకులస్థులకే వర్తించదు. ఎంతటి

దొడ్డవానిలోనైనా (అతడు గొల్ల కాకపోయినా) ఏవో కొన్ని దౌర్బల్యాలు వుండనే వుంటాయి. హితులైనవారు ఈ దౌర్బల్యాలను నిర్లక్ష్యం చేసి, కేవలం సుగుణాలకే ప్రాధాన్య మిస్తారు; అహితులైనవారు ఇందుకు తలక్రిందులుగా ప్రవర్తిస్తారు. అత డెంతటి మహాపురుషుడైనా, చివరికి ప్రవక్తే అయినా, అతని జీవితకాలంలో యావత్తూ మంచిని చెప్పుకోవడం జరగదు; ఇది జరిగినా, యావన్మందీ మంచిని చెప్పుకోవడం జరగదు. గాంధి, మహమ్మద్, జీసస్, గౌతమబుద్ధుడు, సోక్రటీస్ ప్రభృతుల జీవితాలే ఇందుకు తార్కాణం. ఒక చెడ్డమాట వీరిపై వెయ్యాలంటే వెరపు పుట్టడానికిముందు వీరు కీర్తిశేషులు కావలసివచ్చింది.

ప్రసిద్ధులైనవారినిగురించి వారిపట్లగల సదభిప్రాయ, దురభిప్రాయాల ప్రకారం చెప్పుకోడానికి ఎప్పటి కప్పుడు ఏదో వుండనే వుంటుంది. ఏమీ కనబడకపోతే, ఇట్టే దేని నైనా కాయించవచ్చు. పండిట్ నెహ్రూనుగురించి ఢిల్లీలోని అమెరికన్ రాయబారికార్యాలయానికి చెందిన ప్రబుద్ధు డెవడో ప్రస్తుతం ఇదేవిధంగా ఒక కథ కాయించి ప్రచారం చేస్తున్నాడట. అగ్రనాయకత్రయ సమావేశంలో పాల్గొని, ప్రపంచ సమస్యల పరిష్కారంలో తోడ్పడవలసిందిగా తనకు పిలుపువచ్చినట్లు నెహ్రూ కల గన్నాడట. ఆ సమావేశానికి కలలోనే వెళ్ళి, స్టాలిన్‌తో సరససల్లాపా

లాడి, ట్రూమన్‌తో విందారగించి, అట్లీతో వోటుచేసి, తనది స్వతంత్ర విదేశాంగ విధానమని నిరూపించుకున్నాడట. ఈ కట్టుకథ ఇండియా విదేశాంగనీతిపట్ల అమెరికనుల అసంతృప్తిని స్పష్టంగా వ్యక్తీకరిస్తున్నదేమో కాని, నెహ్రూ స్వభావాన్ని సరిగా చిత్రించడం లేదు. త్వరగా మనస్సును త్రెంచుకోలేక, ఒక నిర్ణయానికి రావడంలో ఆయన కొంత తాత్సారం చేయవచ్చు. ఒక నిర్ణయానికి వచ్చిన వెనుక, దాన్ని పరిపాలించడంలో కాఠిన్యాన్ని చూపవలసి వస్తే, అందుకు తెగించలేక ఊగిసలాడవచ్చు. కాని, తన దారి తనదే నని, తా నొకరిమాట విననని చెప్పి, తద్వారా తన స్వతంత్ర చిత్తవృత్తిని వెల్లడించుకోవాలని కోరేవాడు మాత్రం కాడు. లేదా, ఆయననుగురించి ప్రచారమౌతున్న కట్టుకథలోని ధ్వనిప్రకారం, స్వతంత్రంగా వ్యవహరిస్తున్నట్టు నటనచేస్తూ, మరొకరి అడుగుజాడలను (ఈ సందర్భంలో అట్లీ అడుగుజాడలను) అనుసరించేవాడు అసలే కాడు.

"బొంకరా, బొంకరా పోలిగా అంటే, టంగుటూరి మిరియాలు తాటికాయ లంతేసి" అన్నట్టు కట్టుకథ లల్లితే వాటిలో పస వుండదు. ఏ వ్యక్తిని గురించి కథ కట్టబోతున్నామో, అతని స్వభావాన్ని చక్కగా అర్థం చేసుకోవాలి; మనం కట్టే కథలో దాన్ని చమత్కారంగా యిమడ్చాలి. ఈ కళలో మెలకువ లన్నీ ఆకళింపు చేసుకున్నవా డెవడో

కాని, డాబుకూ, దర్పానికీ పడిచస్తుండే ముసాలీనీని గురించి చక్కటి కథ కల్పించాడు: ఫాసిస్ట్ డిక్టేటర్ చచ్చి స్వర్గానికి వెళ్లగా, జూలియస్ సీజర్ ఆప్యాయంగా "అబ్బాయ్! మన రోం విశేషా లేమిటి?" అని పలకరించాడు. "ఇంతటి వాడిని నన్ను పట్టుకుని అబ్బాయ్, గిబ్బాయ్ అంటాడూ!" అని చర్రున కోపం వచ్చి, మారుచెప్పకుండా ముసాలీనీ, మూతి ముడుచుకున్నాడు. అంతట "నన్ను అమర్యాదచేస్తే చేశావు గాని, దేవుడిని అమర్యాద చేసేవు! నలుగురిలో ఔననిపించుకుంటూ పేరుగా బ్రతికిన మన దేశానికి అప ఖ్యాతి వస్తుంది" అని సీజర్ హెచ్చరించాడు. ఆ దారినే పోతూ ఇంతలోనే అక్కడికి కాకతాళీయంగా వచ్చిన నెపోలియన్ "ఇక్కడి మర్యాదలు, కొత్తవాడవు, నీకు తెలియవేమో! దేవుడు వస్తే లేచి నిలబడాలి" అని మాటలో మాట అందుకున్నాడు. "అయితే, నేను కూర్చునే తీర తాను" అని పబ్లిక్ రోడ్డుమధ్య (స్వర్గంలోకూడా పబ్లిక్ రోడ్డు లుంటాయి లెండి) ముసాలీనీ చతికిలబడ్డాడు. ఇదేమి తిక్క మేళమని సీజర్, నెపోలియన్‌లు మథనపడుతుండగా రాజనీతిలో మన చాణక్యునికి సమాన ఉజ్జీ, మాకియవెల్లీ, అక్కడికి రావడం తటస్థించింది. "మీ కెందుకు మీరు ఊరుకుందురూ! ఇతని సంగతేదో నేను చూస్తాను" అని మాకియవెల్లి అంటుండగా, ఆయన మాటలో మాట వేసుకుని దేవుడు వారున్నచోటుకు రానే వస్తున్నాడు.

ఆయనను దగ్గరివరకు రానిచ్చి, "అడుగో! ఫోటోగ్రాఫర్" అని మాకియవెల్లీ అన్నాడు. తక్షణం ముసొలీనీ నిట్ట నిటారుగా లేచి, రొమ్ము విరిచి, మోర పైకెత్తి, గడ్డాన్ని ముందుకు నిక్కబొడిచి, పెదవులు బిగించి, కుడిచేయి పైకెత్తి, ఫాసిస్ట్ సెల్యూట్ చేస్తూ నిలుచున్నాడు.

ఈ ఫాసిస్ట్ డిక్టేటర్‌నుగురించే కాక, ఇతర నియంతలను గురించి కూడా నేను విన్నవే ఇట్టి కల్పిత కథలు మరెన్నో వున్నాయి. నియంతృత్వ దేశాలలో వాక్స్వాతంత్ర్యం శూన్యం. కడుపు మండినప్పుడు నోటికివచ్చినట్టు నాలుగు తిట్టగలిగితే దానితో కోపం కొంత చల్లారుతుంది. ఇందుకు వీలు లేనప్పుడు, బహిరంగంగా పరిపాలకులను పల్లెత్తుమాట అనడమే ఘోర నేరమైనప్పుడు, వారిపై కసితీరడానికి చాటు మాటుగా ఏవో కొన్ని కట్టుకథలైనా చెప్పుకోవాలి కదా! ఈబాపతు కథలన్నీ బహు లబ్బుగా వుండేవైనా నాలు గైదింటినిమాత్రం ఇక్కడ చెబుతాను.

రొమ్ముపట్టకుండా తాను రోజూ పెట్టుకునే మెడల్స్ అన్నింటితో తళుక్కుమంటూ గోరింగ్ ఒక ఉక్కు కర్మా గారం తనిఖీకి వెళ్ళాడు. వెళ్లి, వొయ్యారంగా ఆ కర్మాగారం లోని ఒక హాల్‌లోకి అతడు అడుగు పెట్టీపెట్టడంతోనే రంయ్యని వెళ్లి కప్పుకు తగులుకున్నాడు. ఇదేమి విడ్డూరమని విచారించగా, అతడి వొంటిపైవున్న బండెడు మెడల్సులో

ఇనపవాటి కారణంగా అక్కడి ఎలక్ట్రో-మాగ్నెట్ ఈడ్చివేసినట్టు తేలింది. ఖూనీలు చేయడానికీ, చేయించడానికీ పేరుపడిన గోరింగ్ ఒక బ్రిటిష్ ప్రముఖునికి తానిస్తున్న విందుకు లేటుగా వచ్చి, వేటనుంచి రావడంలో జాగైనందుకు మన్నించవలసిందిగా కోరాడు. విలంబన కారణాన్ని విని, ఆ బ్రిటిషర్ "మృగాల వేటనుంచే అని నమ్ముతున్నాను" అని చమత్కరించాడు. యుద్ధంలో జర్మనీ ఓడిపోతే, తమ గతి ఏమి కానున్నదని గోరింగ్, గోబెల్స్‌ల మధ్య ఒకనాడు సంభాషణరాగా, వాచాలుడైన గోబెల్స్ "నా నోటికి మూతవేసుకుంటే, మరి నన్నెవ్వరు ఆనవాలు కట్టలే" రన్నాడు. "నా పని మరింత తేలిక, నా మెడల్స్‌ను పీకిపారవేస్తే, ఆ దేవుడైనా నన్ను గుర్తుపట్టలే" డని గోరింగ్ పకపక నవ్వాడు.

ఒకనాడు హిట్లర్, గోబెల్స్‌లు పల్లెపట్టులగుండా ప్రయాణంచేస్తుండగా వారి కారుకింద పడి ఒక రైతు పెంపుడు పంది చచ్చిపోయింది. జరిగిన ప్రమాదానికి నొచ్చుకుని, "నావల్ల తనకు కలిగిన ఈ నష్టానికి నన్ను మన్నించవలసిందిగా దీని యజమానిని నువ్వు అడిగిరాక తప్పదు" అని హిట్లర్ గోబెల్స్‌ను పంపించాడు. చాదస్తం కాని, ఈ కాస్త భాగ్యానికే క్షమాపణ లేమిటని కదలలేక కదిలిన గోబెల్స్ కాసేపటిలోనే మోయలేనన్ని పూలూ, పళ్లూ పుచ్చుకుని తిరిగి

చక్కా వచ్చాడు. "తన పందిని చంపడమేమిటి? మనకు పందేరం పంపించడమేమిటి?" అని విస్తుపోతూ, "చూచి రమ్మంటే కాల్చివచ్చే ఘటానివే నువ్వు! ఏమి తంత్రంచేసి వచ్చావేమిటి?" అని హిట్లర్ అడిగాడు. "నాకూ చిత్రం గానే వుంది. గడపలోపలికి అడుగుపెట్టి 'హైల్ హిట్లర్! చచ్చెనయ్యా పంది'* అన్నానో, లేదో ఎగిరి గంతులువేస్తూ నాపైన పూల, పళ్ళవర్షం కురిపించాడు" అని గోబెల్స్ బుర్ర గోక్కుంటూ జవాబిచ్చాడు.

అగ్రరాజ్యత్రయ సభకు తాము టెహరాన్‌లో సమావేశమైనప్పుడు ఒకపూట స్టాలిన్, చర్చిల్, రూజ్‌వెల్ట్‌లు కలిసి ఒకే కారులో వెడుతున్నారు. అప్పుడొక ఆవు దారికి అడ్డంగా నిలబడి వారిబండిని ముందుకు సాగనిచ్చింది కాదు. చర్చిల్ ఒక గంభీరోపన్యాసాన్ని చేసినా, రూజ్‌వెల్ట్ తన రాజనీతిచాతుర్యాన్నిచూపినా, ఫలితంలేక పోయింది. కాని, స్టాలిన్ కారు దిగివెళ్ళి, ఆవు చెవిలో ఏదో రహస్యం ఊదేసరికి కాళ్ళసత్తువకొద్దీ అది పెద్ద పరుగు తీసింది. ఏమి కిటుకు చేశావని ఆ ఉక్కుమనిషిని ప్రశ్నించగా, "మరేమీలేదు. 'నిన్ను సమష్టివ్యవసాయకేంద్రానికి తోలిస్తాను సుమీ!' అని ఒక్కమాట అన్నాను" అని బదులుచెప్పాడు.

---

* "హైల్ హిట్లర్! ది పిగ్ ఈజ్ డెడ్"

ప్రసిద్ధపురుషుల స్వభావాలు ఆధారంగా గలవి కొన్ని కట్టుకథలు కాగా, వారి స్వరూపాలను ఊతగొనేవి మరి కొన్ని వుంటాయి. బెర్నార్డ్ షాతో అంతులేనన్ని వాగ్యుద్ధాలను చేసిన జి. కె. చెస్టర్టన్ పిప్పళ్ళ బస్తాలా వుండేవాడు. ఆయన ఎంత స్థూలకాయుడో బెర్నార్డ్ షా అంత బక్కపలచటివాడు. వారి శరీరాకృతులను పురస్కరించుకొని ప్రచారంలోకి వచ్చిందే ఈ కింది కథ: ఒకనాడు బెర్నార్డ్ షాను "నిన్ను చూస్తే, దేశానికి కరువు వచ్చిపడిందని అనుకోవలసి వస్తున్నది సుమీ!" అని చెస్టర్టన్ స్సేళన చేశాడు. "నిన్ను చూస్తే, ఆ కరువు నీవల్లనే వచ్చినట్టు తీర్మానించుకోవలసివస్తున్నది" అని షా వెంటనే మాటకు మాట అప్పగించాడు. చెస్టర్టన్ స్థూలకాయాన్నిగురించి మరొక కథ చెబుతారు. క్రిక్కిరిసివున్న ట్రామ్‌లో ఒక మూలకు వొదిగి నిలిచివున్న ఇద్దరు నారీశిరోమణులను చూచి, "పాపం, ఆడకూతుళ్ళు" అని తన సీటునుంచి ఆయన లేచేసరికి, ఆ స్థలం వారిద్దరికీ ఎక్కాతక్కీగా సరిపోయింది.

ఇంత సొగసైనవీ ఆస్ట్రియాకు కొంతకాలం డిక్టేటర్‌గా వున్న డాల్ఫస్‌నుగురించిన కథలు. ఆయన వామనమూర్తి. అంగుళంయెత్తు బూట్సు వేసుకున్నా అయిదడుగులైనా నిండా వుండేవాడు కాడు. ఈ మరుగుజ్జు ఒకనాడు నిచ్చెనపై

నుంచి పడి కాలువిరగగొట్టుకున్నాడు. అతడు నిచ్చెన వేసింది నేలములక చెట్టుకు. విరోధులు అతడిని చంపడానికి కుట్రచేసి, పడకగదిలో ఒక ఎలుకలబోను పెట్టారు. అత డిపై ప్రయోగాలు చేసి, పరమాణుశాస్త్రంలో మహా పండితుడుగా ఒక ఆస్ట్రియన్ శాస్త్రవేత్త నోబెల్ బహుమతి పొందాడు. ముసోలీనీతో సమావేశానికి రోం వెళ్లినప్పుడు డాల్ఫస్ రైలులో ప్రయాణం చెయ్యలేదు; ఎయిర్ మెయిల్‌లో బంగీగా అతడిని పంపించారు. ఆస్ట్రియన్ సర్వసేనాని ఒకనాడు సైనికవందనం అందుకుంటూ వేదికపై తన కాలివద్ద తాబేలు ప్రాకుతున్నదని త్రుళ్ళిపడ్డాడు. కాని, అది తాబేలూ, గిబేలూ కాదు; శిరస్త్రాణం ధరించి వున్న ఆస్ట్రియన్ డిక్టేటర్. ఆస్ట్రియాను స్వాహాచెయ్య డానికి అడ్డువస్తున్నాడని "ఆ పొట్టి బుడంకాయను సఫా చేసి రండి" అని హిట్లర్ కొందరు నాజీలను పంపించాడు. వా రొకనాటి రాత్రి డాల్ఫస్ పడకగదిలోకి ప్రవేశించారు. అలికిడికి నిద్రలేచిన డాల్ఫస్ పిల్లవాడి గొంతుపెట్టి "మానాన్న ఇంట్లో లేడు" అనేసరికి నిజమే అనుకుని ఆ నాజీలు వచ్చినదారినే చక్కాపోయారు. పోస్టుబిళ్ళలపై డాల్ఫస్ చిత్రాన్ని అచ్చువేసినప్పుడు శిరోభాగాన్నిమాత్రం వేస్తే దానిలో ఒక మూలైనా నిండదని "లైఫ్‌సైజ్"లో మూర్తినంతటినీ ముద్రించారు.

వ్యక్తులనుగురించే కాక, జాతులనుగురించి కట్టుకథలు అనేకం వ్యాప్తిలోకి వస్తుంటాయి. ఐరిష్‌వారు మందబుద్ధులని, స్కాటిష్‌వారు పిసినిగొట్టులని, ఇంగ్లీష్‌వారు భల్లూకపుపట్టు పట్టగలవారని యూదీయులు టోపీ పెట్టడంలో దిట్టలని, అమెరికనులు కోతలరాయుళ్ళని, ఇటాలియనులు పిరికివారని ఆయాజాతులకు ముందు కొన్ని ప్రత్యేక గుణాలను, లేదా, అవగుణాలను ఆపాదిస్తారు. తర్వాత తాము ఆపాదించిన గుణావగుణాలే ఆధారంగా ఆ జాతులనుగురించి కథలు కల్పిస్తుంటారు. ఇవి అనంతం. వీటిని చెప్పడం ప్రారంభిస్తే తెమలడం కష్టం. అందువల్ల ఐరిష్, ఇటాలియన్ జాతులకు సంబంధించిన కథలను కొన్నింటినిమాత్రం చెప్పి అంతటితో విరమిస్తాను.

ఐరిష్‌వాడొకడు ఒక పెట్టెకంటె మరొకటి చిన్నదిగా రెండింటిని కుట్టడానికి ఆర్డరిచ్చివెళ్ళాడు. ఆ విధంగానే చెయ్యగా "ఒకదానికంటె మరొకటి చిన్నదిగా వుండాలని నేనంటే, ఒకదానికంటె మరొకటి పెద్దదిగా ఎందుకు తయారుచేశారు?" అని కోపగించుకున్నాడు. మరొక ఐరిష్‌వాడు కొత్త కంబళి కొనుక్కుని, కప్పుకున్నప్పుడు అది తలవైపు చాలా ఊరికే మిగిలిపోతున్నదని, కాళ్ళను కప్పుకోవడమే లేదని, శుష్కదండుగ బేరమైపోయిందని విచారించాడు. సిరిసంపత్తులుగల విధవరాలుతో స్నేహంగా వుంటూ, పదేళ్ళుగా ప్రతి సాయంత్రం ఆమె యింటి

వద్ద గడుపుతున్న ఐరిష్‌వానితో "ఆమెను కట్టుకో రాదటయ్యా!" అంటే, "నాకూ ఆ ఊహ తట్టింది కాని, పెండ్లాడిన తర్వాత సాయంత్రంపూట కమ్మని టీ ఎవరిస్తారు? కమ్మని కబుర్లు ఎవరు చెబుతారు?" అని జవాబిచ్చాడు. పోతే, చివరికథ ఇటాలియనుల పిరికితనాన్ని గురించి: ముసా లీనీ కూతురు, ఎడ్డా, తమ దేశానికి సహాయంగా జర్మనీ పంపిన కొన్ని టాంకులను చూచివచ్చి వాళ్ళ నాన్నకు "మనల్ని హిట్లర్ పచ్చిమోసం చేశాడు. ఒక్క టాంకు కైనా రివర్స్ గీర్ లేదు" అని ఫిర్యాదు చేసింది. రివర్స్ గీర్ బండిని వెనక్కి నడపడానికి ఉపకరించే సాధనమని వివరించవలసివస్తే, ఈ కథ సారస్యమే చెడుతుంది.





# అలవాట్లు

మూడవ సిగరెట్టు విసిరి పారవేసి, నాల్గవదాన్ని ముట్టించాను. తర్వాతేగాని వ్రాతకుతగిన "మూడ్" కుదరలేదు. మనస్సు కళ్లెంలేని పొగరుబోతు గుర్రం వంటిది. దారీ తెన్నూ లేకుండా అది తన చిత్తంవచ్చినట్లు పోతుంది; గట్టులను పుట్టలను చెంగు చెంగున దాటుతుంది; ఒక దిక్కుకు వెడుతూ కారణంలేకుండానే మరొక దిక్కుకు మళ్ళుతుంది; పరుగుపరుగున పోతూనే హఠాత్తుగా ఆగుతుంది; ముందుకాళ్ళను పైకెత్తి వెనకకాళ్ళపై నిలుస్తుంది. సకిలిస్తుంది; దొర్లుతుంది; లేచి, తిరిగి ఎటో, ఎందుకో దౌడుతీస్తుంది; నురుగులు కక్కుతుంది; చెమటలు కార్చుతుంది; డొక్కలు ఎగరవేస్తుంది. కళ్ళెం తగిలించి, అంకెలోకి తెచ్చుకుని, ఒక దారిని నడిపించకపోతే, మనస్సుకూడా ఇదే రీతిగా చిత్తంవచ్చినట్టు పరుగిడుతుంది; కుప్పిగంతులు వేస్తుంది; కొక్కిరాయి చేష్టలు చేస్తుంది.

కొన్ని గుర్రాలకు ఏ తాడైనా కళ్లెంగా పనికి వస్తుంది; మరి కొన్నింటికి ఇనప కళ్లెం వుండాలి; వేరొక కొన్నింటికి కక్కుల కళ్లెం కావాలి. మనస్సు విషయంలోకూడా

ఇంతే! నా తలంపులు చెదిరిపోకుండా వుండాలంటే, నేను సిగరెట్లు కాల్చాలి. నా స్నేహితులలో వొకనికి కారాకిళ్ళీ దట్టించనిదే వ్రాత సాగదు; మరొకనికి పచ్చివక్క నెమరు వెయ్యనిదే కలం నడవదు; ఇంకొకనికి ఇంతకంటె ఘాటైన పదార్థం—కాదు, పానీయం—కావాలి. తామరాకు మీద పడిన నీటిచుక్కవలె, అద్దంమీద వొలికిన పాదరసంవలె మహాచంచలంగా వుండే మనస్సును వశవర్తినిగా చేసుకోటానికి ఈవిధంగా ఒక్కొక్కరికి ఒక్కొక్క సాధనం అవసరమౌతూవుంటుంది.

మన పెద్దన్నగారికి "నిరుపహతిస్థలంబు, రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు కప్పురపు విడెము, ఆత్మకింపయిన భోజనము, ఊయెల మంచము": ఇవన్నీకూడా కవితా వ్యవసాయానికి అవసరమౌతూవుండేవట! రాయలవారి ఆస్థానకవి; ఆయన అభిమానాన్ని చూరగొని కవిగండ పెండేరం కాలికి తొడిగించుకున్న ఉద్దండుడు. నిరుపహతిస్థలమైనా, రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు కప్పురపు విడెమైనా, ఆత్మకింపయిన భోజనమైనా, ఊయెల మంచమైనా, మరే భోగమైనా ఆయన కోరుకోవాలే కాని, అందుకు అడ్డు వుంటుందా? కాని, ఒంటికాలిమీద తపస్సు చేసినా సామాన్యులకివి దొరకవు. కాబట్టి ఒక కప్పు కాఫీతోనో, ఒక ప్యాకెట్ సిగరెట్లతోనో, ఒక చిటిక పొడుంతోనో, ఒక వక్కపలుకుతోనో సరిపెట్టుకోవాలి.

ఏకాగ్రతకు ఇవి ఏవిధంగా తోడ్పడతాయి? ఏమో, ఆ విషయాన్ని చెప్పడం కష్టం. సిగరెట్లు కాల్చే నాసంగతే చూద్దాము. పొగాకులో "నికొటిన్" అనే విషం వున్నదట. అది నరాలపై పనిచెయ్యడంవల్లనే ఏకాగ్రత కుదురుతుందా? అందువల్లనే వ్రాత చకచక సాగుతుందా? ఏమో, నాకు తెలియదు. ధూమపానంవల్ల వ్రాత సాగే మాట నిజమే కాని, అది సారంలేని చచ్చువ్రాత అని టాల్‌స్టాయ్ వాదం. "చాలామంది అంటారు (ఒకప్పుడు నేనూ అనేవాణ్ణి) మెదడు చురుకుగా పనిచెయ్యడానికి ధూమపానం తోడ్పడుతుందని. మెదడు ఏమి పనిచేసిందని కాక, ఎంత పని చేసిందని చూచుకుంటే మాత్రం ఈ మాట నిస్సందేహంగా వాస్తవమే. ధూమపానం చేసేవానికి, ఆ కారణాన తన ఊహలను తరచి చూచుకోనివానికి, ఒక్కసారిగా ఎన్నో భావాలు తట్టినట్టు అనిపిస్తుంది. ఇలా అనిపించడం నిజంగానే చాలా భావాలు స్ఫురించినందువల్ల కాదు; ఆలోచనాశక్తి అంకుశాన్ని తప్పినందునే" అని టాల్‌స్టాయ్ వ్రాశాడు. ఇంతటితో ఆయన ఆగలేదు; ఇంకా వాదించాడు. "పనిచేస్తున్నవాడిలో ఇద్దరుంటారు; ఒకడు పనిచేసేవాడు, రెండవవాడు ఆ పని మంచి సెబ్బరలను తరచి చూచేవాడు. ఎంత గట్టిగా తరచిచూస్తే అంత నిదానంగా పని సాగుతుంది. తరచిచూచేవాడిని పొగతో ఊదరపెడితే, ఎక్కువ పని సాగినా, దానిలో పస తక్కువ."

టాల్‌స్టాయ్ వ్యాసంనుంచి ఈ వాక్యాలను తెనిగించే లోపల నేను అర సిగరెట్టు ఊదివేశాను. ఇంతమాత్రం చేత నా తెనిగింపు చచ్చుగా వున్నదంటే నేను అచ్చుకుంటానా?

పోనీ, నామాట విడిచి పుచ్చండి. ధూమపానంవల్ల వివేచనాశక్తి సడలడమే నిజమైతే, నిద్రపోతున్నప్పుడు తప్ప నోటినుంచి పైప్‌ను తియ్యని బెర్‌ట్రెండ్ రస్సెల్ వివేచనా పటిమకు ప్రపంచప్రసిద్ధిని ఏవిధంగా పొందగలిగాడు? ధూమపానంవల్ల మేధాపటిమ మందగించడమే నిజమైతే రస్సెల్‌వలె "పైప్" భక్తుడైన ఆల్బర్ట్ ఐన్‌స్టీన్ ఎనలేని మేధానిధిగా ఏ విధంగా పేరు మ్రోగుతున్నాడు? ఇంతే కాదు. టాల్‌స్టాయ్ చెప్పినట్టు సిగరెట్టు నాలుగు దమ్ములు లాగగానే ఆలోచనలు పెద్ద జలవలె ఊరుకువచ్చినట్టు తోస్తుందనడంకూడా అన్ని సందర్భాలకు వర్తించదు. నా మట్టుకు నా అనుభవంలో ఒక్కొక్కప్పుడు సిగరెట్టుపై సిగరెట్టు కాల్చినా ఒక్క ఆలోచనైనా తోచదు సరిగదా, తల అంతకంతకు దిమ్మెక్కుతుంది, కళ్లు తిరుగుతాయి, గుండెలలో మంట పుడుతుంది, మనస్సు సహారా అయిపోతుంది.

చూస్తూచూస్తూ పెద్దవాడిని ఒకమాట అనడానికి నోరు రాదు కాని, టాల్‌స్టాయ్ "వృద్ధనారీపతివ్రత" వంటివాడు. తానే చెప్పినట్టు, ఆయన ఒకప్పుడు ధూమపానం

చేసేవాడు. మద్యాన్ని కూడా పుచ్చుకునేవాడు. (అయితే, అన్నవలె మోతాదును మరీ మించనిచ్చేవాడు కాడనుకోండి.) రుబుల్స్ వొడ్డి పేకాట ఆడేవాడు; కొన్ని ఇతర జూదాలు కూడా ఆడినవాడే. జూదంలో అప్పులపాలై మళ్లీ దాని జోలికి పోరాదని పదేపదే వొట్లు వేసుకున్నాడు; అవి పదే పదే పరగడుపు అయిపోయినవి. ఒకసారి జూదంలో నాలుగువేల రుబుల్సు అప్పుపడి, జమీందారీని బావకు అప్పగించి, తనఖర్చులకింద సాలుకు 500 రుబుల్సు మాత్రం యిస్తూ, మిగతా రాబడితో ఋణాన్ని తీర్మానంచేసి పెట్ట వలసిందిగా అభ్యర్థించాడు. మరొకమారు జూదంలోనే వెయ్యి రుబుల్సు బాకీ తేలి, దాన్ని తీర్చడానికి వేరే దారి లేక, వ్రాస్తున్న ఒక పుస్తకాన్ని తొందరపడి అమ్ముకున్నాడు. టాల్‌స్టాయ్‌కి జూదంపైనేకాక వేటపైకూడా మక్కువ వుండేది. వ్యభిచారి కాకపోవచ్చుగాని, పరనారీ సాహచర్యాన్ని యెరగనివాడుమాత్రం కాడు. మొదట ఇంతగా ''భోగి''అయినవాడు చివరికి ధూమపానాన్నిపోలిన స్వల్ప బలహీనతపైకూడా కత్తులు నూరబట్టే పల్లెత్తుమాట అనరాని పెద్దవాడని తెలిసికూడా ''వృద్ధనారీ పతివ్రత'' అని అప్రయత్నంగానే అనివేస్తాము.

''కొత్త వైష్ణవులకు పంగనామాలు దండి'' అన్నట్టు, వయస్సు మళ్లినతర్వాత నీతిబోధకు దిగిన టాల్‌స్టాయ్ ''జూదగాళ్లు దాదాపు యావన్మందీ ఎందుకు ధూమపానం

చేస్తారు?...పణ్యాంగనలు, పిచ్చెక్కినవారు యీావన్మందీ ఎందుకు పొగత్రాగుతారు?" అని ప్రశ్నించ నారంభిం చాడు. ఇంతటితోనైనా ఆగితే కొంత నయమే. కాని, ఆయన పొగత్రాగడానికీ, ఖూనీచెయ్యడానికీ చాలా దగ్గరి సంబంధం వున్నట్టుకూడా చెప్పుకువచ్చాడు. తనకు చుట్టమైన ఒక ముసలమ్మను చంపివేయడానికి ఆమె కొలువులోవున్న వంటవాడు నిర్ణయించుకొన్నాడుట. ఆ ముసలమ్మ యింటిలోనే పనిచేస్తున్న దాసి ఆ వంటవాడికి ఉంపుడుకత్తెగా వుండేదట. ఆ పిల్లను యింటినుంచి పంపించివేసి, నూరిపెట్టుకున్న కత్తితో వాడు ముసలమ్మ పడకగదిలోకి వెళ్లబోయాడట. కాని, మనస్సు పీకిందట, అడుగు ముందుకు పడనేలేదట. గిరున వెనక్కుతిరిగి, గడగడ రెండు గ్లాసుల వోడ్కా (రష్యన్ సారాయి) తాగి, ఆతర్వాత గబగబ వెళ్లి ఖూనీచేసివేశాడట. అయితే, టాల్‌స్టాయ్ కథలో ఇది పూర్వఘట్టం మాత్రమే; దీని ఉత్తరఘట్టంలోనే ధూమ పానంచేసే పరమదుర్మార్గుల ప్రస్తావన వస్తుంది. ముసలమ్మ పడకగదిలో ప్రవేశించిన వంటవాడు కత్తితో మెడపై ఒక పోటు పొడిచేసరికి ఆమె గిజగిజ తన్నుకుంటూ కింద పడి పోయిందట. చిమ్మటిగొట్టంతో కొట్టినట్టు గాయంనుంచి నెత్తురు బుస్సుమంటూ పొంగి కాల్వ కట్టిందట. దాన్ని చూడగా గుండె బేజారై వాడు బయటికి వెళ్లిపోయి, సిగరెట్టు ముట్టించి గబగబ నాలుగు దమ్ములు పీకాడట.

పీల్చినపొగ లోనికివెళ్లి వాడి ఆత్మ కళ్లను కప్పి, దాని చెవులను మూసి, దాని నోటికి తాళంవేసిన వెనకగాని తిరిగి పడకగది లోకి అడుగుపెట్టి, ముసలమ్మ మెడను పూర్తిగా కోసి, ఆమె నగానాణెంకోసం గాలించడానికి వాడికి ధైర్యం చిక్కలేదట.

నీతిబోధకు ఇతర కథలను అల్లినట్టు టాల్‌స్టాయ్ దీన్ని అల్లలేదనే అనుకుందాము; ఇది నిజంగా జరిగిందనే అంగీకరిద్దాము. కాని, సిగరెట్లు కాల్చేవారందరు ఖూనీలు చేస్తున్నారా? ఖూనీలుచేసినవారిలో పొగాకువాసనైనా గిట్టని వారు లేరా? ఎవడో వొకడు ఖూనీచేస్తూ సిగరెట్టు కాల్చాడని హత్యకు, ధూమపానానికి ముడిపెట్టడం భావ్యమా? కావాలంటే ఈ విషయంలో మనం టాల్‌స్టాయ్ మాటను ఆయనకే అప్పగించడం ఏమంత కష్టం కాదు. సిగరెట్లు కాల్చినరోజులలో ఆయన "యానా కెరీనా", "వార్ అండ్ పీస్" మొదలైన గొప్పగొప్ప నవలలను లోకానికి ప్రసాదించాడు. ఆయననుంచి లోకం ఇంకా ఆశించిన మహాకావ్యాలన్నింటి ఖూనీ సిగరెట్లను కాల్చడం మానివేసినంతనే ఆయన చేతులమీదగానే జరిగిపోయింది!

ప్రసక్తానుప్రసక్తంగా ధూమపానాన్నిగురించి విశేషంగానే చర్చ జరిపినా, ఈ వ్యాసోద్దేశం దాని సమర్థన కాదు. ధూమపానం దురభ్యాసమైతే కావచ్చు. (నేను మాత్రం ఆ మాట వొప్పుకోననుకోండి.) దానికి లోను కావడం ఘోరావినీతి కాదు; దానికి దూరంగా వుండడం

మహానీతి కాదు. పుణ్యపాపాలతో దానికి సంబంధమే లేదు. అయితే, గియితే, అది ఇతరులకు చెరుపు చెయ్యని చాపల్యంమాత్రమే. ఏమైనా, రచయితలకు కావలసిన ఏకాగ్రతా సాధనకు అది దివ్యంగా తోడ్పడుతుంది. దాన్ని కాకపోతే, మరొకదాన్ని ఏకాగ్రతా సాధనకు రచయితలైనవారు ఆలంబనం చేసుకోనడం సర్వసాధారణంగా తప్పదు. కొందరిని చూడండి: వారికి చుట్ట, బీడి, సిగరెట్టు, పొడుం మొదలైన వ్యసనా లేవీ వుండవు. చివరికి వక్కపలుకైనా నమలరు. అయినా, ఏకాగ్రత కుదరాలంటే, వారికిసయితం ఏదో ఒక ఊత కావలసివస్తుంది. చిన్నచిన్న కాగితాలపై తప్పితే కొందరికి వ్రాతసాగదు; పెద్ద కాగితాలు లేకపోతే మరికొందరికి అక్షరం రాలదు; ఆలోచన పోవాలంటే కొందరికి ఏకాంతంకావాలి; మరికొందరికి సందడి కావాలి. టెలిఫోన్ ఒక వైపున, టెలిప్రింటర్ మరొక వైపున, టైప్‌రైటర్ ఇంకొక వైపున గణగణ, టకటక, ధణధణ రొద చేస్తూ, తమ ఊహలకు తగిన తాళంవెయ్యనిదే పనిచెయ్యలేని జర్నలిస్టులు ఎందరినో నే నెరుగుదును. కాని, జర్నలిస్టులలోనే కొందరికి రచనాసమయంలో కాలి అలికిడైనా కూడదు. "మాంచెస్టర్ గార్డియన్" ఎడిటర్, మిస్టర్ సి. పి. స్కాట్, ఆగంతకుల కాలి అలికిడికి ఆలోచనలు ఎక్కడ చెదిరిపోతాయోనని తన కార్యాలయాన్ని రత్నకంబళాలతో కప్పివుంచుకునేనాడు. వీటి అన్నింటినీబట్టి

ఏకాగ్రతకు ఏది సాధనం కాగలదనే విషయం కేవలం ఆయా వ్యక్తుల అలవాట్లపై ఆధారపడివుంటుందనే చెప్పాలి.

బాగా చెయ్యితిరిగి, పెద్ద పేరుపొందిన హేమాహేమి రచయితలు కూడా ఏదో ఒక అలవాటుకు బానిసలే! తుడుపుపడితే, రవీంద్రనాథ్ టాగోర్‌కు మరి కలం నడిచేది కాదు. ఆ తుడుపును రంగులపెన్సిల్‌తో ఏదైనా ఒక బొమ్మకిందికి మార్చివేసేవాడు. చేతిలోని చివరి దమ్మిడీ కూడా చెల్లిపోవాలి, బాకీలు మోపుకావాలి; అప్పులవాళ్ళు వెంటదరమాలి—అప్పుడుగాని డాస్టవస్కీకి వ్రాయడానికి వేడి పుట్టేదికాదు. రత్నకంబళాలతో, చక్కని చిత్రపటాలతో, ఉత్తమ గ్రంథసంచయంతో, సుగంధపుష్పాలతో అలంకరించిన గదిలో ఏకాంతంగా కూర్చుంటేనే తప్ప షెకవ్‌కు కథ నడిచేదికాదు. ఒక్కొక్కమాటను పది సార్లు పైకి వల్లించి చూచుకుని, అది చెవికి ఇంపుగా వున్నదో, లేదో నిర్ణయించుకోవడమే కాకుండా, దాన్ని బ్లాక్‌బోర్డు మీద సీమసున్నంతో వ్రాసి, కంటికి సొంపుగా వున్నదో, లేదో తేల్చుకున్నమీదటగాని ఫ్లోబేర్‌కు ఆ పైమాట తోచేది కాదు. ఎంతటివారైనా అలవాట్లకు బానిసలైపోతారనడానికి ఈ విధమైన నిదర్శనాలను మరెన్నింటినైనా చూపవచ్చు.

అసలు మన బ్రతుకే కొన్ని అలవాట్ల పోగు. అభ్యస్త మార్గం వెంట శ్రమలేకుండా, చివరికి కళ్లు మూసుకుని

కూడా, మనం నడవగలము. ఇదే విధంగా జీవితమార్గం వెంటకూడా కష్టంలేకుండా పురోగమించడానికి మనం ఎన్నో అభ్యాసాలను చేసుకుంటాము. అయితే, అలవాటైపోయిన పనిలో ఆనందం తక్కువ. అందుచేత ఒక్కొక్కప్పుడు మన అభ్యాసాలను అతిక్రమించ గోరతాము. కాని, దానికి చాలా, మానసికదార్ఢ్యం కావాలి, సంకల్పబలం కావాలి. అది మనలో చాలామందిలో మృగ్యం. ఆ కారణాన మనం అభ్యాసాల బానిసత్వంనుంచి బయటపడ్డం అరుదు. స్వతంత్రవ్యక్తికి బాధ్యతలు హెచ్చు. తన స్వాతంత్ర్య రక్షణకు అతడు సతతం అప్రమత్తుడై వుండాలి. అవసరమైతే అందునిమిత్తం ఎట్టి కష్టనష్టాలకైనా, ఎంతటి శౌర్య త్యాగాలకైనా సన్నద్ధపడాలి. బానిసకు ఈ సమస్య లుండవు. తన పోషణకు; తన రక్షణకు, తన కష్టసుఖాలకు అతడు పూర్తిగా తన యజమానిపై, లేదా, పరిపాలకునిపై ఆధారపడతాడు. అందువల్ల అతడి బ్రతుకు సాఫీగా నడుస్తుంది. సాఫీబ్రతుకు కోరుకుంటాము కాబట్టే మనం కూడా అలవాట్లకు కట్టువడివుంటాము. మన మంచిచెడ్డలు మన అలవాట్ల మంచి చెడ్డలపై ఆధారపడివుంటాయి. కాని, వాస్తవికంగా జీవితమాధుర్యాన్ని అనుభవించగలవాడు అభ్యాసాల ప్రాబల్యానికి లొంగిపోనివాడే.



# పరామర్శ

పలకరిస్తేనే తప్ప పలక్కపోవడం నాకు పరిపాటి. ఇంగ్లీషు చదువులవల్ల కొన్ని ఇంగ్లీషు సంప్రదాయాలు వొంటబట్టడమే ఇందుకు కారణం కావచ్చు. తామిద్దరి మధ్య ఉభయులకు తెలిసిన మూడవ వ్యక్తి పరిచయలాంఛనం— దీన్ని "ఇంట్రడక్షన్" అంటారు — నడిపితేనే తప్ప ఏ యిద్దరింగ్లీషువారు మాట్లాడుకోరు. టామ్, డిక్‌లు వెల్లవారితే అడుగడుగుకు తారసిల్లేవారే కావచ్చు. అయినా, తామిద్దరికీ తెలిసిన హ్యారీ తటస్థపడి, "హ్యావెంట్ యు మెట్ బిఫోర్?" అంటూ యథావిధిగా "ఇంట్రడక్షన్" లాంఛనాన్ని నడపనిదే వారు ఒకరినొకరు పలకరించుకోరు. హ్యారీ సంధానకర్తృత్వం లేకుండానే టాం, డిక్‌లకు మాటలు కలవాలంటే, అందుకు ఏ రెండు, మూడువారాలో కొంత తంతు నడవాలి. ముందు కొన్ని రోజులు తాము మార్గమధ్యంలో తటస్థపడినప్పుడు నవ్వీనవ్వనట్టు చిరునవ్వు నవ్వాలి. తర్వాత కొన్నిరోజులు చిరునవ్వు నవ్వుతూ, తమ హ్యాటుల అంచులను యెత్తీయెత్తనట్టు కాస్త పైకెత్తుతూ వుండాలి. ఆపైన కొన్నిరోజులు "గుడ్ మార్నింగ్",

"గుడ్ ఈవినింగ్" లతో సరిపుచ్చాలి. ఆ తర్వాత ఎవరో వొకరు చొరవచేసి సంభాషణకు ఉద్యమించాలి. అప్పుడైనా "ఫైన్ డే" అనో, "బీస్ట్లీ వెదర్" అనో వాతావరణ వర్ణనతో ప్రారంభించాలి. ఇంత దీర్ఘమైన ఈ తంతు నడపడానికి వీలులేక, వెంటనే పలకరించుకోవలసిన అగత్యం కలిగితే, "పార్డన్ మి" అంటూ క్షమాభిక్ష కోరుతూ ఉపక్రమించాలి.

"ఇంట్రడక్షన్" లేనిదే ఒకరినొకరు పలకరించుకొన రాదని ఇంగ్లీషువారికున్న ఈ సంప్రదాయప్రాముఖ్యాన్ని ఇతరులు తరచు అవహేళనచేస్తూవుంటారు. నట్టనడి సముద్రంలో పెద్ద తుపానులో చిక్కి ఒక వోడ భళ్లున బద్దలై పోయిందట. ఇద్ద రింగ్లీషువారు తప్ప దానిలోనివా రందరు సముద్రంపాలై పోయారట. పర్వతాలవలె లేస్తూ, పాతాళానికి కూలిపోతున్న కెరటాలలో తలమునక లౌతున్నా పక్కా రెండుగంటలసేపు వా రిద్దరు మాట్లాడుకోనే లేదట. ఆ తర్వాత వా రిద్దరిలో ఒకడు తెగించి, రెండవవాడిని సమీపించి, అపరిచితుని పలకరించడానికి ఏదో ఒక కుంటిసాకు కల్పించుకోవాలి కనుక, అక్కడికి కొన్ని వేల మైళ్ళ దూరంలో వున్న సౌథాంప్టన్ ఓడ రేవు ప్రసక్తి తెచ్చి, "పార్డన్ మి, దయచేసి సౌథాంప్టన్‌కు దారి చెప్పగలరటండీ!" అని అడిగాడట!

కొత్తవారిని పలకరించడానికి ఇంతగా కొట్టుమిట్టాడడం ఇంగ్లీషువారి సంప్రదాయం కాగా, కొత్తవాడు కనబడ్డమే పాపంగా అతడిని బోనులో ముద్దాయికంటె హీనంగా క్రాస్ ఎగ్జామినేషన్ చేయడం మన సంప్రదాయం. "మనదే వూరు?" ప్రశ్నతో ఈ కఠిన పరీక్ష ప్రారంభమౌతుంది. తర్వాత "పే రేమిటి? కుల మేమిటి? గోత్ర మేమిటి? తండ్రి యెవరు? ఆయన బాగా వున్నారా? ఏమి చేస్తుంటారు? అన్నదమ్ము లెంతమంది? అక్క చెల్లెళ్ళో? అందరికీ వివాహాలైనవా? ఏ యే వూళ్ళిచ్చారు? పొలం పుట్రా వున్నవా? ఏ పాటి? పాడి వున్నదా? చదువుకుంటున్నావా? ఉద్యోగంలో ప్రవేశించావా? చదువుతుంటే, ఏమి చదువు? ఉద్యోగమైతే, అదేమి ఉద్యోగం? జీత మెంత? పైసంపాదన ఏమైనా వుంటుందా? అబ్బే! పైసంపాదన లేకపోతే, జీతపురాళ్ళేమి సరిపోతాయి?"— ఈ విధంగా ఈ ప్రశ్న పరంపరకు అంతే వుండదు. "మన దే వూరు?" అని కలుపుగొట్టుతనాన్ని వెళ్ళబోసుకుంటూ పరామర్శను ప్రారంభించిన పెద్దమనిషి మరొక నిమిషానికో, రెండు నిమిషాలకో "మనకు పిల్ల లెంతమంది?" అని ప్రశ్నించడంకూడా కద్దు!

పనిలేని పని కల్పించుకొని అపరిచితులైనవారు మన పుట్టుపూర్వోత్తరాలను విచారించడాన్ని నావలెనే సహించలేని నా మిత్రుడొకడు రైలులో ఒకనాడు ప్రయాణంచేస్తుండగా అతని కెదురుబల్లపై కూర్చున్న పెద్దమనిషి "మన





దే వూరు?" అంటూ మామూలు కథను ఉపక్రమించాడు. వెంటనే ఇతడు తనది ఫలానా ఊరని చెప్పి, అంతటితో ఆగక, తన పేరు ఫలానా, తన తండ్రి పేరు ఫలానా, తన ఉద్యోగం ఫలానా, తన జీతం ఫలానా, తన సంతానం ఫలానా వగైరా, వగైరాలన్నీ గుక్క తిరగకుండా చదివేసి, "నన్ను గురించి ఇంకేమైనా భోగట్టా కావాలేమో సెల వివ్వండి — మనవి చేసుకుంటాను" అంటూ గుడ్లు వురి మాడు. ఇందుకు ఆ పెద్దమనిషి రవ్వంతైనా తెల్ల బోలేదు సరిగదా, మందహాసం చేస్తూ, "అయ్యా! తమరు కోపగించనంటే మరొక్కటే ప్రశ్న. తమ తల్లిగారు తమ కెన్ని పలాల వస పోశారో దయచేసి కాస్త చెబుతారూ?" అని అడిగాడు!

అపరిచితులను వారి పుట్టుపూర్వోత్తరాలను గురించి అడ్డదిడ్డంగా ప్రశ్నించే మన దేశాచారానికి అవసినాఘులు కూడా అతీతులుకారనే చెప్పాలి. ధర్మరాజు సన్న్యాసి వేషంతో విరటుని కొల్వుకూటానికి వచ్చాడో, లేదో —

> ఎయ్యది జన్మభూమి, గుల మెయ్యది, యెయ్యది యున్నచోటు, పే
> రెయ్యది, మీర లిందులకు నిప్పుడు వచ్చినదానికిం గతం
> బెయ్యది, నాకు నంతయును నేర్పడఁగా నెఱిఁగింపుఁడున్న రూ
> పయ్యది......

అని ఆయనను మత్స్యభూపాలుడు ప్రశ్నల జడివానతో ముంచెత్తుతాడు. "ఎయ్యది జన్మభూమి?" అని ప్రారం

భించడంలో పోనీ తప్పు లేదనుకోండి. కాని, ఆ వెంటనే "కుల మెయ్యది?" అని నిగ్గదియ్యడం తగునా? అవి కులధర్మాలకు, కులవృత్తులకు "ఢోకా" లేని రోజులు—దీన్ని నేను కాదనడంలేదు. కులధర్మాలను, కులవృత్తులను కాపాడ్డం అప్పటి రాజుల ప్రథమ కర్తవ్యమనికూడా నాకు తెలుసు. కాని, ఆకాలంలోనైనా చూస్తూచూస్తూ సన్న్యాసిని "కుల మెయ్యది?" అని ప్రశ్నించడం అనౌచితి కాదా? ఎంత జాగ్రత్తగా "మేకప్" చేసుకున్నా మారువేషం సరిగా కుదరనందునే ధర్మరాజు సన్న్యాసికాడని విరటమహారాజు అనుమానించాడని అనుకోడానికి అది వేసుకున్న వేషం కాదయ్యె! పాండవాగ్రజుడు "కరకమలంబులు మొగిచి ఫాలభాగమునం గదియించి సంప్రార్థనంబుగా వినయవినమిత మస్తకుండు" అయ్యేసరికి ధర్మదేవత అనుగ్రహంతో "ఉన్న యునికిన సన్న్యాసిరూపం" అలవడిందయ్యె! కేవలం దైవానుగ్రహంవల్ల కలిగిన మారురూపు చూచీ చూడగానే రహస్యం బట్టబయలు చేసేదిగా వుంటుందా? పోనీ, అలవాటులో పొరపాటుచొప్పున "కులమెయ్యది?" అని విరటుడు యతీంద్రుని అడిగాడనే అనుకుందాము. కాని, ఒకచెంపను "జగము లెల్లను నేలఁగఁ జాలు తేజ మా ముప్పురతోడి జోడి" అని మెచ్చుకుంటూనే "నాకు నంత యును నేర్పడఁగా నెఱిఁగింపుఁ డున్న రూపయ్యది" అనడం

సమంజసమా? "కల్లిబొల్లి కబుర్లు చెప్పేవు సుమా!" అనే ధ్వని దీనిలో లేదా? ఈ ధ్వని కలదు కనుకనే—

ఉన్నరూప పలుకు నన్నరు లెక్కడఁ
గలరు? తోఁచినట్లు పలుకు పలుక
నైనచంద మయ్యె, నంతయు కొం కంత
పట్టి చూడఁగలరె యెట్టివారు?

అని ధర్మరాజు జవాబుచెప్పడం జరిగింది.

సంసారులనైనా, సన్న్యాసులనైనా ప్రశ్నలవర్షంతో పలకరించడం పరిపాటి కాబట్టే, సిద్ధుడు తారసిల్లగానే ప్రవరాఖ్యుడు "ఎందుండి యెందుఁబోవుచు నిందుల కేతెంచి నార లిప్పుడు?" అని నిలవేస్తాడు. మరొక క్షణానికి ఆ శాస్త్రులో కలిగిన పరిచయాన్నే పురస్కరించుకుని—

ఏయే దేశములన్ జరించితిరి మీ
రేయే గిరుల్ చూచినా
రేయే తీర్థములందుఁ గ్రుంకిడితి రే
యే ద్వీపముల్ మెట్టినా
రేయే పుణ్యవనాళిఁ గ్రుమ్మరితి రే
యే తోయధుల్ డాసినా
రా యా చోటులఁగల్గు వింతలు మ
హాత్మా! నా కెఱింగింపరే

అని వెంటబడతాడు.

ఆర్చేవారూ, తీర్చేవారూ కాకపోయినా పని కట్టుకుని మన యోగక్షేమాలను గుచ్చిగుచ్చి అడిగేవారిలో కొందరు

అతి ప్రేమను, వినయాన్ని నటించగా, మరికొందరు కొంత నిక్కి నీల్గి పోతారు. చూస్తూ చూస్తూ కొత్తవారిని పట్టుకొని "ఏం, గీం" అనలేరు. కాని, "ఏమండీ" అనడం తమ ఘనతకు భంగకరంగా తోస్తుంది. ఈ చిక్కునుంచి తప్పుకోడానికి "మన దేవూరు? ఎక్కడికి ప్రయాణం? ఏమిటి విశేషాలు?" అంటూ "ఏం" కాని, "ఏమండీ" కాని వాడ నవసరంలేకుండా ప్రశ్నలు వేస్తారు. ఈపాటి తాక్యం తెలియని మరి కొందరు "ఏం గొడుగూ!", "ఏం కావడీ!", "ఏం బండీ!", "ఏం మోపూ!" మొదలైన ప్రయోగాలను ఆయా సందర్భాలనుబట్టి చేస్తుంటారు. వెనకటికి ఒక పెద్దమనిషి ఒక కమ్మటూరుగుండా తాటాకు గొడుగు వేసుకుని వెడుతున్నాడట. అప్పుడు వెనకనుంచి ఆ ఊరు ఆసామి "ఏం గొడుగూ!! ఏం గొడుగూం" అంటూ పిలిచాడట. ఆ పిలుపులను చెవిపెట్టకుండా తనదారిని తాను పోతుంటే, అదే కేకవేస్తూ వెంటబడ్డాడట. ఇక లాభం లేదని ఆ పెద్దమనిషి ఆగిపోయి, తన వెంటబడిన వ్యక్తి దగ్గరికి వచ్చేవరకు ఆగి, తీరా దగ్గరికి వచ్చినతర్వాత "కమ్మకు పుట్టి, కమ్మకు పెరిగావ్; కమ్మ పిలిస్తే పలకవా?" అని తన తాటాకు గొడుగును నేలకు విసిరి విసిరి కొట్టాడట.

పొరుగూరు మనిషి తమ వూరుగుండా వెడుతుంటే, మీ దేవూరని, ఎక్కడికి వెడుతున్నారని వెంట తరిమి

కూడా విచారించడం ఈనాడు అమర్యాదగాను, అసభ్యం గాను పెక్కుమందికి తోచినా, ఒకనాడు దీనితో పెద్ద అవసరం వుండేదనే అనుకుంటాను. తరచిచూడము కాని, ప్రతి ఆచారానికీ వెనక ఏదో ఒక అవసరం దాగేవుంటుంది. ఆ అవసరం వున్నంతవరకు అది సదాచారం; అది తీరిన వెనక దురాచారం. ఉదాహరణకు భ్రూణ, శిశుహత్యలనే చూడండి. ఈనాడు వీటిని మనం క్షంతవ్యంకాని మహాప రాధంగా పరిగణిస్తాము. కాని, మానవుడు వ్యవసాయ వృత్తి నెరుగని రోజులలో, ఒకే స్థానాన్ని అంటిపెట్టుకు వుంటే క్షుధార్తికి లోనుగావలసిన రోజులలో, ఆహారా న్వేషణకై స్థానంనుంచి స్థానానికి నిత్యం పరిభ్రమించినా అందరికీ అన్నివేళల కడుపునిండుగా తిండీతిప్పలు దొరకని రోజులలో సంతానాభివృద్ధి శాపంలానే తోస్తుండేది. ఇందు వల్ల భారమనితోచిన సంతానాన్ని పుట్టకముందో, పుట్టిన వెనకో సఫాచేసివెయ్యడం ఆరోజులలో సదాచారంగా వుండేది. నాటి పరిస్థితులు మారిపోయినా, నాటి మానసిక స్థితిలోనే మిగిలిపోయిన కొన్ని ఆటవిక జాతులలో భ్రూణ, శిశుహత్యలు ఇటీవలివరకు — యాభై, నూరేళ్ళ క్రితం వరకు—జరుగుతూనేవుండేవి. విక్టోరియాకు (ఆస్ట్రేలియా) చెందిన బాంగెరాంగ్ జాతివారు పుట్టిన పిల్లలలో సగం మందిని పుట్టుకలోనే చంపివేసేవారు. చాకోకు (దక్షిణ

అమెరికా) చెందిన లెంగ్వా తెగవారు ఒక్కొక్క కుటుం బానికి ఏడేళ్ళకు ఒక బిడ్డ చొప్పునమాత్రం బ్రతకనిచ్చేవారు. మరొక తెగవారు — ఆచిపోన్ తెగవారు — కుటుంబానికి ఒక పిల్లను, ఒక పిల్లవాడినిమాత్రం మిగిల్చి, మిగిలిన బిడ్డ లందరినీ ఈలోకంలో అడుగుపెట్టడమే తడవుగా పరలోకానికి సాగనంపేవారు. చూస్తూ, చూస్తూ కన్నబిడ్డల గొంతు పిసకడం కష్టం కాబట్టి, కొన్ని తెగలవారు ఏదో ఒక మూఢ నమ్మకంతో గుండెను దిటవుచేసుకునేవారు. ఎదురుకాళ్ళను పుట్టని పిల్లల నందరినీ (ఎదురుకాళ్ళను పుట్టడం సర్వసామా న్యంగా జరగదు) కీడుమూడ్చగలవారని బాండై తెగవారు మట్టుబెట్టేవారు. కామ్ఛాడల్ తెగవారు గాలివానలో పుట్టినవారినందరినీ ఖతంచేసేవారు. మడగాస్కర్‌లోని కొన్ని తెగలవారు మార్చి, ఏప్రిల్ నెలలలోను, బుధ, శుక్ర వారాలలోను, ఏ మాసంలోనైనాసరే చివరి వారంలోను పుట్టినవారినందరినీ ప్రాణాలతోనే పూడ్చిపెట్టేవారు; లేదా, నీళ్ళపాలుచేసేవారు. ఇతర ఆటవికజాతులు కొన్నింటిలో కవలలు పుడితే, బాలింతరాలు పెడదారితొక్కివుండాలని, లేకపోతే ఒకే కాన్పులో ఇద్దరు బిడ్డలు పుట్టివుండరని, బిడ్డల జంటను కాని, వారిలో ఒకరిని కాని చంపివేసేవారు. ఎక్కడికో ఖండాంతరాలకు పోవడం దేనికి? పూర్వం మన దేశంలోనూ ఈ ఆచారం వుండేది. గంగ శంతనునిద్వారా తనకు కలిగిన అష్టసంతానంలో ఏడుగురిని నీళ్ళపాలు

చెయ్యలేదా? కనీసం ఎనిమిదవ కొడుకును (భీష్ముని) బ్రతక నివ్వమని భర్త కోరినందుకే అలిగి ఆయనకు విడాకులిచ్చి వెళ్ళిపోలేదా? ఉత్తర హిందూస్థానంలో నూరేళ్ళక్రితం వరకు తొలిచూలు బిడ్డను "గంగామాయీ"కి అర్పిస్తుండే వారు. ఇది ఆ ప్రాచీన సంప్రదాయం అవశేషమై వుండ వచ్చుగదా?

పొరుగూరు మనిషి కనబడగానే వెంటతరిమి ప్రశ్నల వర్షాన్ని కురిపించే ఆచారంకూడా అవసరంకొద్దీ సదాచారంగా యేర్పడి, అవసరం తీరినవెనక దురాచారంగా మిగిలిపోయిందే. ప్రపంచంలో రెండు, మూడు శతాబ్దాల క్రితంవరకు శాంతి భద్రతలు తక్కువ. మనదేశంలో శతాబ్ది క్రితంకూడా కన్నం దొంగతనాలు, దార్లు కొట్టడం వగైరాలు తరచు జరుగుతుండేవి. పట్టపగలే ఊళ్ళను దోచుకోవడం సంభవిస్తుండేది. కొత్త ముఖం ఊళ్లో కనబడితే ఏ దొంగల ముఠాకో, ఏ దోపిడిగాండ్ర జట్టుకో వేగులవాడు కావచ్చునన్న అనుమానానికి తావుండేది. దుక్కలాంటివాడు వాకిటిలోకి బిచ్చానికి వస్తే "దొంగ వెధవలు! పగలుచూచి రాత్రి కన్నంవేస్తారు" అనేమాట ఈనాటికీ కొన్ని పల్లెలలో వినవస్తుంది. పాతకాలంలో భద్రత తక్కువకాబట్టే ప్రతి పరాయిమనిషి మంచి చెడ్డలను విచారించడం ప్రాణావసర మయ్యేది.

అపరిచితుడైన ప్రతి వ్యక్తిని దొంగగానో, తోడుబోతుగానో శంకించవలసిన అవసరం ఈనాడు లేదు కాబట్టే, ప్రభుత్వ గూఢచారి అనుమానితుని విచారించే ధోరణిలో మన ముక్కు ముఖాలైనా ఎరుగనివారు మన పుట్టుపూర్వోత్తరాలను గురించి ప్రశ్నలవర్షం కురిపిస్తే, మనం చికాకు పడతాము. అవసరం తీరినంత త్వరగా ఆచారం తొలగదు. అయినా, ఒక్కొక్క సంవత్సరం గడచినకొద్దీ "మనదేవూరు?" ప్రశ్న మరింత తక్కువగా వినబడుతున్నది. నా మట్టుకు నాకు ఇది శుభసూచకం.



# పరధ్యాస




"బిమ్మకైనను పుట్టును రిమ్మ తెగులు" అన్నారు. ఆ తెగులు పరాకు చిత్తగించడమేనని నా గట్టి అనుమానం. అన్యథాయత్తచిత్తుడై వున్న క్షణంలోనే బ్రహ్మ ఈ సృష్టిని చేసి వుండాలి. లేకపోతే, అంతులేనన్ని అవక తవకలు జరిగేవా? బంగారానికి వన్నెవుంటే తావి లేదు; కోయిలకు పాట వుంటే రూపు లేదు; పాముకు పడగలో మణి, కోరలలో విషం; గులాబికి కాడచివర పువ్వు, కాడంతా ముళ్ళు. ప్రభాతం మురిపెం పది నిమిషాలు, ఇంద్రధనుస్సు బులపాటం నూటికో కోటికో. భగవత్సృష్టిలో అధికులమని విర్రవీగే మన విషయంలోనైనా ఒక తీరూ, దారీ వుంటేనా! యవ్వన మిచ్చినవాడు వృద్ధాప్యాన్ని ఎందుకు పంపకం చెయ్యాలో చెప్పండి! బ్రతుకు నిచ్చినవాడు చావు నెందుకు తగలాటం చెయ్యాలో ఆలోచించండి! ఈ విధంగా అన్నీ వైరుధ్యాలే, అన్నీ ద్వంద్వాలే. వెలుగు వెనకే చీకటి, కలిమి వెన్నంటే లేమి, వృద్ధి వెన్నుతన్నుతూనే క్షయం, సంతోషం సరసనే దుఃఖం, ప్రేమగర్భంలోనే ద్వేషం, ఒక్క మాటలో, అమృతకలశంలోనే విషబిందువు! సృష్టి

చేసే సమయంలో ఎంత పరాకుగా లేనిదే ఆ పాడు బ్రహ్మ దేవుడు ఇన్ని పొరపాట్లు చేసివుంటాడు!

బ్రహ్మకే ఇంత పరాకు వుండగా ఆయన పుట్టించిన మనకు ఇందులో ఒక అంశ వుండడం అబ్బురమా? తక్కిన వారి మాట ఏమోగాని, నేను తరచు పరాకు చిత్తగిస్తుంటాను. ముట్టించిన సిగరెట్టును ముట్టించినవెంటనే పరాకుగా పారవేసి కొత్తదాన్ని ముట్టించడం, కాలుతున్న సిగరెట్టుతో కట్టుగుడ్డలు కాల్చుకోవడం మనకు మామూలు. తిండి తినిందీ, లేనిదీ తరచు జ్ఞాపకం లేకపోవడం మనకు రివాజు. కొన్ని గంటలోపల గొడుగును పారవేయడం, రోజున్నరలోపల ఫౌంటెన్ పెన్ జారవిడవడం మన రికార్డు. పోస్టు బిళ్లలను డబ్బాలో వేసి, ఉత్తరాన్ని భద్రంగా వెనక్కి తెచ్చిందిమాత్రం ఒక్కసారే! అయితే, ఈ విషయంలో నన్ను మెరుగనిపించిన నా మిత్రులొకరున్నారు. కాలేజీ ప్రిన్సిపాల్‌గా పనిచేస్తూ పొరుగూరు వెళ్ళి, మరి వారంరోజులు సెలవిప్పించవలసిందిగా కాలేజీ కమిటీ ప్రెసిడెంట్‌కు, తాను తిరిగి వచ్చేవరకు ఇల్లూ, పిల్లలూ జాగ్రత్త అని భార్యకు వ్రాసి, ఒకరి కవరులో మరొకరి ఉత్తరం పెట్టి భద్రంగా పోస్టుచేశాడు.

మన లోపాలను చూచి లోకులు నవ్వుతుంటే పెద్ద వారితో పోలిక పెట్టుకుని వాటిని కప్పివేసుకోడానికి ప్రయ

త్నించడం మానవస్వభావం. పొరబాటు తప్పంటే మాజినీ, మార్క్సులు మొదలుకొని చర్చిల్, స్టాలిన్‌లవరకు అన్ని రకాల పెద్దలలో ఎందరో పొరబాటు చేసేవారే కారా అని రెట్టిస్తాము. చుట్టముక్కలకు డబ్బులు లేక, ఒకసారి మాజినీ "క్లోక్"ను తాకట్టు పెట్టాడనికూడా చెబుతాము. మితిమీరిన ఖర్చులు తగవంటే, డాస్టవస్కీ, గోల్డ్‌స్మిత్ వగైరాలు పొదుపరితనానికి ప్రఖ్యాతిగన్నవారా అని అడుగుతాము. లేదా, చిత్తరంజన్ దాసుకు, ప్రకాశంపంతులుకు ఏమి లోపం వచ్చిందంటాము. మళ్లీ మాట్లాడితే, పోయిన నిన్నను గురించి, పుట్టని రేపునుగురించి దిగులుపడక, నేటి మాధుర్యాన్ని నేడే గ్రోలాలని ఉమర్‌ఖయాం చెప్పిన పద్యాన్ని అప్పజెబుతాము. పెద్దలతో పోలికలు వెతుక్కోవడం ప్రారంభిస్తే, అసలు కప్పివేసుకోరాని లోపమే వుండదేమో! జూదం ఆడరాదంటే, "నల, ధర్మజులే ఆడలేదా?" అని తప్పుకోవచ్చు; మద్యపానం కూడదంటే, "దేవతలు సురాపానం చేసేవారుకారా?" అని తీంర్డించవచ్చు.

తక్కిన లోపాలను నేను సమర్థించినా, సమర్థించకపోయినా, పరాకు చిత్తగించడం మాత్రం తప్పు కాదంటాను. అదిఒక లోపమైనా కాదంటాను. ఏ పనిలోనో, పాటలోనో చిత్తం పూర్తిగా హత్తుకున్నందువల్లనే తక్కిన ప్రపంచాన్ని మరచిపోవడం తటస్థిస్తుంది. పరధ్యాస అనే

పదాన్నిబట్టే ఇది స్పష్టం. ధ్యాస ఒకదానిపై పూర్తిగా లగ్నమైనందునే తక్కిన అన్నింటిపట్ల పరధ్యాస ఏర్పడుతుంది. ప్రాచీనకాలపు ఖగోళ శాస్త్రజ్ఞుడు థేల్స్ -- గ్రీసు కడుపున పుట్టిన ఏడుగురు మహామేధావులలో ఒకడుగా ఈయన లెక్కకు వస్తాడు—బాలకుడై వుండగా నక్షత్రాల వంక తదేకంగా చూస్తూ, మురుగునీళ్ళ గుంటలో బొక్కబోర్లగా పడినందుకు కడుపు చెక్కలుగా నవ్వి, "నీ కళ్ళ యెదుట నున్నవాటిని కానలేనినువ్వు చుక్కలను చూచి ఏమి తెలుసుకుంటావురా?" అని వెక్కిరించినవారు తెలివితక్కువవారు. ఆబాల్యంగా చుక్కలపై అంతగా చూపు పెట్టబట్టే, తర్వాత కొన్ని శతాబ్దాలకుగాని ధ్రువపడని అనేక ఖగోళశాస్త్ర సత్యాలను ఆయన జోస్యం చెప్పినట్టు చెప్పగలిగాడు.

పరధ్యాస పాపమేమీ కాకపోయినా, మరీ మితిమీరితే ప్రాణాలకే అది మోసం తేవచ్చు. ప్రాచీనకాలపు ప్రసిద్ధ గ్రీక్ గణితశాస్త్రవేత్త అర్కిమిడిస్ (ఆయన తనకాలానికి గొప్ప ఇంజనీర్ కూడా) రేఖాగణితంలో తలమునకలౌతూ అన్నపానీయాల మాటే మరచిపోయేవాడు. పట్టబలవంతంగా స్నానాగారాలకు (పబ్లిక్ బాత్స్) లాక్కువెడితేనే తప్ప స్నానమైనా చేసేవాడు కాడు. అక్కడైనా తలంటుకుంటూ, నూనె పట్టించబడిన తన వొంటిమీద త్రిభుజాలూ,

చతుష్కోణాలూ గీసుకుంటూవుండేవాడు. ఇంతగా తన లోకంలో తాను బ్రతికేవాడు కాబట్టే చివరికి ఆయన కటికి చావు చావవలసివచ్చింది. తమ నగరం సైరక్యూస్‌ను రోమనులు పట్టుకున్నప్పుడు అర్కిమిడిస్ తన లెక్కలగొడవలో తా నున్నాడు. పెద్ద పోరు చెలరేగడం, అది చల్లారడం ఆయన కానలేదు సరిగదా, "మా ముఖ్య సేనాని మార్సెల్లస్ నిన్ను తోడుకురమ్మన్నా డయ్యా!" అంటూ వచ్చిన రోమన్ సైనికుడు పెట్టిన పొలి కేకలైనా ఆయన చెవిని దూరలేదు. గొంతు పగిలేటట్టు అరచి అరచి, "సీ కింత పొగరా!" అని పట్టరానికోపంతో కత్తిదూసి, ఆ సైనికుడు అర్కిమిడిస్‌ను ముక్కముక్కలుగా నరికివేశాడు.

పరధ్యానంవల్ల ప్రాణోపద్రవం కలిగే ఘట్టాలకంటె పరిహాసాస్పద సన్నివేశాలలో పడవలసివచ్చేవే హెచ్చు. మహాశాస్త్రవేత్త సర్ ఐజక్ న్యూటన్ అసలు పరాకుతోనే పుట్టినాడేమోనని అనిపిస్తుంది. "గొర్రెలను కాస్త మేపరా, అబ్బాయ్" అని వాళ్ల అమ్మ పంపిస్తే, వాటిదారి వాటిదే కాగా, తాను పుస్తకం చేతబుచ్చుకుని ఏ చెట్టుకిందో గంటలకొద్దీ చతికిలబడేవాడట. పెద్దవాడై, ప్రఖ్యాత పురుషుడైనవెనక, ఒకనాడు నలుగురు మిత్రులను పిలిచి విందుచేస్తూ, "వైన్" తెస్తానంటూ వెళ్లి, వేరే ఆలోచనలో పడిపోయి విందును, దానికి వచ్చినవారిని మర్చిపోయి,

చర్చికి వేళ్లైపోయిందని వీధిలోకి చక్కాపోయాడట: తనను విందుకు పిలవగా బయల్దేరి వెడుతూ, మార్గమధ్యంలో చిత్తం అన్యథాయత్తం కాగా, తప్పుదారికి తిరిగి, పది వీధులు చుట్టి, ఇంటికి చేరుకున్న సందర్భాలు అనేకం వున్నవట. ఒక పర్యాయం గుర్రంపై ఎక్కడికో ప్రయాణమై వెడుతుండగా, కొండ దాటవలసివచ్చిందట. పాపం, గుర్రాన్ని శ్రమపెట్టడం దేనికని కిందికి దిగి, కళ్లెం పట్టుకుని దాన్ని నడిపించుకుంటూ పోయాడట. తీరా కొండ దాటి వెళ్లిన తర్వాత చూచుకుంటే చేతిలో కళ్లెమే మిగిలివున్నదట! తాను దిగి నాలుగు అడుగులైనా వెయ్యకముందే గుర్రం ఉడాయించి వెయ్యడాన్ని ఆయన అప్పటివరకు కాననే లేదట! మరొకమారు సరిగా రెండు నిముషాలే కోడిగుడ్డును ఉడకనివ్వా లనుకుని, గడియారాన్ని పొయ్యిపైకి ఎక్కించి, కోడిగుడ్డును చేతబుచ్చుకున్నాడట.

ఆంగ్లకవి, రచయిత ఆలివర్ గోల్డ్‌స్మిత్ పరధ్యాసను గురించి ఎన్ని చిత్రకథ లున్నవో లెక్కలేదు. ఎడింబరోలో డాక్టరీ చదవడానికి వెళ్ళినప్పుడు, పెట్టె బేడా ఒక హోటల్‌లో పెట్టించి, షికారుకు బయల్దేరాడు. చిమ్మ చీకటిపడేవరకు తిరిగిన తర్వాత, ఇక బసకు చేరుదామనుకుంటే, ఆ వీధి పేరు, ఆ హోటల్ పేరు ముందు అసలు విచారించి వుంటేనా! అదృష్టం బాగుండి, పెట్టె బేడా

మోసిన కూలీ తటస్థపడబట్టి, గుడ్డా గుడుసూ, డబ్బా దుగ్గాణీ, సమస్తం పోగొట్టుకుని అంగలార్చవలసిన యోగం తప్పింది. ప్రసిద్ధి కెక్కినతర్వాత ఒకమారు ఆయన లార్డ్ క్లేర్ అతిథిగా వుంటున్నాడు. అప్పుడొక పూట ఏమీ తోచక, భోజనాల వేళకుముందు షికారు వెళ్ళాడు. కాళ్ళ గుడులు తీరేవరకు నడచినపిమ్మట లార్డ్ క్లేర్ భవంతికి తిరిగి రావడానికి మారుగా, దాని పొరుగునేవున్న నార్తంబర్ ల్యాండ్ డ్యూక్ భవనంలో ప్రవేశించి, సరాసరి వెళ్ళి డైనింగ్ టేబుల్ వద్ద బైఠాయించాడు. ఆ పొరుగింటి పెద్దమనిషి, ఆయన భార్య, తనకు సుపరిచితులైనందున వారూ లార్డ్ క్లేర్ అతిథులుగా వచ్చారన్న భ్రమతో వారితో లోకాభిరామాయణం ప్రారంభించాడు. ముందు తెల్లబోయినా, గోల్డ్ స్మిత్ ఏమి తప్పుచేసివుంటాడో ఊహించుకుని, ఆ దంపతులు పిలవని పేరంటంగా వచ్చిన తమ అతిథిని ఏ మర్యాదలోపం లేకుండా చూచి పంపించారు.

పరధ్యాస గాథ లన్నింటిలో నాకు యెక్కువగా నచ్చేది గత యుద్ధానికి ముందు కొంతకాలం గ్రీస్‌కు డిక్టేటర్‌గా వున్న జనరల్ మెటాక్సస్ కథ. తాము కొత్తగా తెప్పించిన విమానాలను పరీక్షచేద్దామని ఒకనాడు ఆయన పనిపెట్టుకు బయల్దేరాడు. పైలెట్‌ను తప్పుకోమని తానే ఒక విమానాన్ని నడుపుతూ చాలా చక్కర్లు కొట్టాడు. తర్వాత విమానాన్ని

భూతలంపై దించబోతుండగా, పక్కనున్న పైలెట్ "క్షమించాలి, జనరల్! ఇది నీళ్ళపై దిగే విమానం. మనం సముద్రంపై దిగడమే మంచిదేమో!" అని మెలుకువ చేశాడు. "నిజమే సుమీ! పరాకుగా వుంటిని" అని మెటాక్సస్ సముద్రంవైపుకు మరలి, తిరిగి ఎట్టిపొరపాటు చెయ్యకుండా భద్రంగానే విమానాన్ని నీళ్ళపై దించాడు. పిమ్మట "మృదువుగా నన్ను హెచ్చరించినందుకు నిన్ను మెచ్చుకుంటున్నానోయ్!" అంటూ విమానం తలుపు తెరచి చటుక్కున దిగి, బుటుక్కున మునిగి, సముద్రస్నానం చేశాడు!

మన రాజులు బహు హెచ్చుగా పరాకు చిత్తగించే వారేమో! కానిచో, "బహుపరాక్ అని వారిని...వుండండి! కమురువాసన కొడుతున్నది...పంచె కాలిపోతున్నట్టున్నది!





# నిద్రాదేవత

ప్రాతకు కూర్చున్నానన్నమాటే కాని, చెడ్డ బడలికగా వున్నది. కళ్లు మండుతున్నవి. కనురెప్పలు బరువుగా వున్నాయి. ఎండముఖం చూడ్డం కష్టమై పోతున్నది. తల నాదు. కీలు కీలూ నములుతున్నది. నడుం నిలవడం లేదు. అసలు శరీరమే బరువెక్కినట్టుగా వున్నది. ఆవలింతలు వస్తున్నవి. ఇన్ని లక్షణాలు చెప్పినమీదట ఇక రోగనిదానం కష్టం కాదు. అది — నిద్రలేమి. రాత్రి సరిగా నిద్రపట్టనే లేదు. చదువుతున్న పుస్తకం పదేపదే అవతల పెట్టాను. పడక కుదురుతుందేమోనని దిండ్లను ఇటు మార్చాను, అటు మార్చాను. కళ్ళు గట్టిగా మూసుకున్నాను. వొడ్డును పట్టిన చేపవలె మంచంలో అశాంతంగా కొట్టుకున్నాను. లేచి పచార్లుచేశాను. ఇన్నిపాట్లు పడగా కంటిమీద రెప్ప పడేసరికి చుక్కలు వాలిపోయాయి; తొలికోడి కూసింది.

పెట్టిపుట్టిన కొందరికి ఇట్టే నిద్రపడుతుంది. వీరు "ఓ" అంటే, నిద్ర "కో" అంటుంది. తల్లివొడిని చేరే బిడ్డకంటె వడిగా వీరు నిద్రాదేవత పర్యంకాన్ని చేరతారు. కంచు

గంటలా ఈ క్షణంవరకు మోగుతూనే వుంటారు; మరు క్షణంలో కిమిన్నాస్తి! మాట ఎప్పుడు మానివేస్తారో, గురక ఎప్పుడు మొదలిడతారో చెప్పడం మహాకష్టం. ఆ వేళకు మనమే మాట్లాడుతూవుంకడడం, తాము "ఊ" కొడుతూవుండడం తటస్థిస్తే మాగన్ను వేస్తూనే "ఊఁ, ఊఁ" అంటూవుంటారు. అయితే, అది మరొకలోకం సరి హద్దులనుంచి వచ్చే సవ్వడి. పోను పోను అది మందగిస్తుంది. చివరికి అసలే నిలిచిపోతుంది. తర్వాత కొన్ని క్షణాలకు గాని మనం మాట్లాడుతున్నది గాలికేనని తెలుసుకోము. నిశీథి నిస్తబ్ధత వెంటనే ద్విగుణీకృతమైనట్లు తోస్తుంది. అది మనలను వెక్కిరిస్తున్నట్లే అనిపిస్తుంది. ఆ వెక్కిరింతకు మనం ఉడికిలము; మందహాసం చేస్తాము. లేదా, "ఎంత అదృష్టవంతుడు" అని నిద్రపోతున్న వ్యక్తిని చూచి కొంచెం అసూయపడతాము. చూస్తూ చూస్తూ వుండగానే ఇలా చిటుక్కున నిద్రపోగలవారు సర్వసాధారణంగా చీకూ చింతా లేనివారై వుంటారు, కల్లా కపటం యెరగనివారై వుంటారు; లేదా, నోట నాలుక లేనివారై వుంటారు. తూర్పూ పడమరా తెలియనివారై వుంటారు.

జాగ్రదవస్థనుంచి సుషుప్త్యవస్థలోకి వెళ్ళడమంటే చేతన జగత్తునుంచి అచేతనప్రపంచంలోకి పాదం పెట్టడం. నిద్ర పోయిన ప్రతిసారీ మనం మృత్యులోకంలోకి తొంగిచూచి

నట్టే చెప్పవచ్చు. నిద్ర తాత్కాలికమృతి కావడంవల్లనే మనకు తెలిసినంతవరకు అన్ని భాషలలోను "దీర్ఘనిద్ర", "శాశ్వత నిద్ర" మృత్యువుకు పర్యాయపదాలైనాయి. క్రిస్టఫర్ మార్లో మృత్యు, నిద్రాదేవతలకు అక్కచెల్లెళ్ళ వరస పెట్టాడు. అవి కవలబిడ్డలని అలెగ్జాండర్ పోప్ అన్నాడు. నిద్ర స్వభావాన్ని చర్చించడంద్వారా బృహదారణ్యకోపనిషత్తులో జనకమహారాజుకు ఆత్మ, పరమాత్మ తత్త్వాలనే వివరించడానికి యాజ్ఞవల్క్య మహాముని ప్రయత్నించాడు.

నిద్రకు, మృతికి ఇంత దగ్గరి చుట్టరికం వున్నందున సుషుప్త్యవస్థలో పడాలంటే మృత్యులక్షణాలు కొన్ని మనలను ఆవహించాలి. వీటిలో ముఖ్యమైంది శూన్య మనస్సు. ఎవరికి మనస్సు శీఘ్రగతిని, సులభంగా శూన్యం కాగలదో వారికే శీఘ్రగతిని, సులభంగా నిద్రపడుతుంది. చీకూ చింతా వున్నా, కల్లా కపటం వున్నా మనస్సుకు నిద్ర వుండదు. మనస్సుకే నిద్ర లేనప్పుడు మనిషికి ఎలా నిద్ర పడుతుంది? స్వామిద్రోహానికి వొడిగట్టి డంకన్‌ను హత్య చేసినవెంటనే మెక్బెత్‌కు "ఓరీ! నువ్వు మరి నిద్రపోవద్దు, హత్యకు నిద్ర వుంటుందటరా!"అని ఎవరో గద్దించినట్టు వినబడుతుంది. అతడు ఉలిక్కిపడతాడు. నిజానికి ఆ మాటను పలికింది మరెవ్వరో కాదు; అతని మనస్సే. చీకూ చింతా

లేనివారే, కల్లాకపటం యెరగనివారే సుఖనిద్రకు నోచుకున్నవారని అదే అతని నోట పలికిస్తుంది.

నిర్మలమైన మనస్సుకు ముందుగా చెప్పుకోవలసింది పసిపాపలను. అందువల్లనే అనుకుంటాను, వారికి ఇట్టే నిద్రపడుతుంది. హాయిగానూ నిద్రపడుతుంది. ఒకరి జోలికీ శొంఠికీ పోక, తమ రెక్కలకష్టంపై తాము బ్రతికే పాటకపుజనం మనస్సుకూడా అద్దంలా స్వచ్ఛమై, స్నిగ్ధమై వుంటుంది. మంచంపై మేను వాల్చడమే తడవుగా వారూ గాఢనిద్రలో మునుగుతారు. "సింహాసన ద్వాత్రింశిక" చెప్పినట్లు—

పనిచేసి గంజియైనను, యంబలైనను
నెద చల్లగా ద్రాగి, యెచటనైన
పడియుండి, వెన్నెల గుడిపాట పాడగా
పేదల కాత్మ సంప్రీతి కలుగు.

మెదడు తక్కువైనవారికీ తేలికగానే నిద్రపడుతుంది. జడత్వానికి నిద్రతో చెలిమి కలదు కనుకనే మందబుద్ధిని "నిద్రమొహం" అని గేలిచేస్తారు. జడబుద్ధి కాబట్టే కుంభకర్ణుడు నిద్రపోతే వరసగా ఆరు నెలలు అదే పనిగా నిద్రపోయేవాడని మన పురాణాలు చెబుతున్నవి. మైమరచి నిద్రపోవడాన్నే మెచ్చుకోవలసివస్తే, అందరికంటె ఎక్కువగా మనం కుంభకర్ణుని మెచ్చుకోవాలి. కాని, అతడిని మెచ్చుకోము; "నిద్రాదేవత నిన్ వరించెగదరా, నిర్భాగ్య దామోదరా?" అని అపహసిస్తాము.

మాట్లాడుతూ, మాట్లాడుతూ నిద్రపోవడం కాని, మైమరచి నిద్రపోవడం కాని విశేషాలు కానేకావు. కోరి నప్పుడు, కోరినంతసేపు నిద్రపోగలగడమే విశేషం. నెపో లియన్‌కు ఈ అద్భుతశక్తి వుండేదట. గుర్ర మెక్కి—నుడి కారపు గుర్రాన్ని కాదు సుమండీ! నిజమైన గుర్రాన్నే— యుద్ధరంగంలో నిలిచివుండగానైనా సరే నిద్రాదేవతను ఆవాహనచేస్తే త్రుటిలో సాక్షాత్కరించేదట. ఒక్క అయిదు నిమిషాలపాటే సేద తీర్చుకోవాలని అనుకుంటే, అయిదు నిమిషాల తర్వాత ఠంచన్‌గా మెలుకువ వచ్చేదట. ఈ విద్యలో మన గాంధీజీకూడా ఘటికుడే. ఏ జాతీయోద్య మానికో, ఏ పతితజన సముద్ధరణకో భిక్షాపాత్రిక చేతబట్టి, ఆ మూలనుంచి ఈ మూలవరకు కుగ్రామాలనైనా దిగ విడవకుండా దేశపర్యటన చేస్తూ ఏ కాస్త విరామం దొరి కినా ఒక కునుకు తీసేవాడు. అది మిట్టమధ్యాహ్నం కాని వ్వండి, అర్ధరాత్రే కానివ్వండి, "గాంధీకి జై" అంటూ చెవులు చిల్లులుపడేటట్టు భక్తజనులు కేకలుపెట్టడం తప్పక పోయినా, రెండు రైలుస్టేషన్‌లమధ్య కావాలంటే రెప్ప వాల్చేవాడు. కదుకుడు రోడ్డుపై పోతున్న కారు కుదుపుకు వాళ్ళు హూనహూనమైపోతున్నా రెండు పల్లెల మధ్య నిద్రాలేమి లోపాన్ని తీర్చుకునేవాడు. లక్నోలో పోయిన మోతీలాల్ నెహ్రూ కళేబరాన్ని అలహాబాద్‌కు తెస్తుం డగా వెంటనడిచిన కార్లలో ఒకదానిలో గాంధీజీ వున్నా

డట. ఆయనవున్న కారు సగందారిలో బోల్తాకొట్టిందట. దానిలోనివా రంచరు కొన్ని గజాలదూరం వెళ్ళి కుప్పతిప్పలుగా పడ్డారట. ఈ ప్రమాదం జరిగినప్పుడు నిద్రపోతున్న గాంధీజీ కళ్లు విప్పి "ఏమి జరిగింది?" అని ప్రశ్నించాడట. కాని, జవాబుకైనా వేచివుండక అంతలోనే తిరిగి సుఖనిద్ర చెందాడట!

గాంధి, నెపోలియన్‌లవలె కోరినప్పుడు కోరినంతసేపు నిద్రపోగలవారి కోవకు చెందాలంటే ఎంతో సంయమశక్తి కావాలి. తన మెదడు అరలరల భోషాణంవంటిదని, ఎప్పుడు ఏ అరతో పనిపడితే దాన్ని తెరుస్తానని, అరలన్నింటినీ మూసివేయగానే తనకు నిద్రవస్తుందని నెపోలియన్ చెప్పేవాడట. మహాచంచలమైన మనస్సుపై ఇంతగా అధికారం సంపాదించాలంటే, ఎంతగానో ఏకాగ్రత కావాలి; కొంతవరకైనా జితేంద్రియత్వం కావాలి. ఈ లక్షణాలు తరచుగా కానవచ్చేది మహాపురుషులైనవారిలోను, మహాత్ములైనవారిలోను మాత్రమే. నిద్రాదేవికి బానిసలు కాక నాథులై, దాన్ని తమ కనుసన్నల వర్తింపజేసుకోగలవారు వీరే.

సర్వదా ఎందుకో, ఏదో అశాంతిపడని వాడు, "యెద లోపలి యెదలో" ఏవో తుపానులురేగనివాడు మహాకవి కాలేడు. ఇందువల్లనే కావచ్చు, మహాపురుషలక్షణాలను కొన్నింటిని చూపగలవారైనా దాదాపు అందరు మహా

కవులు కంటినిండా నిద్రకు నోచుకోనివాళ్లే. షేక్స్పియర్ దైనందిన జీవితక్రమాన్నిగురించి మనకు తెలిసిన వివరాలు బహు స్వల్పమైనా, ఆయన నాటకాలలో కనబడే నిద్రా దేవత స్తోత్రపాఠాలను చూస్తే, ఆమె కృపావీక్షణం ఆయ నకు లేదనే అనుమానించవలసివస్తుంది. మస్తుగా తిని, మస్తుగా నిద్రపోతున్న బానిసను ఈసడిస్తూనే, అతనివలె రాజులు కమ్మని నిద్రకు నోచుకోలేరుగదా అని హెన్రీ ది ఫిఫ్త్ ఇసుమంత బాధను బయటపెడతాడు. కర్తవ్య నిరూ పణను చేసుకోలేక హామ్లెట్ చిత్తవైకల్యాన్ని పొందివున్న సమయంలో అతని ఆవేదన మృత్యుదేవతో, కనీసం దాని సోదరి నిద్రాదేవతో తనను ఎందుకు చెంతకు తీయదనే! మెక్బెత్ ఆక్రోశంకూడా తాను నిద్రకు దూరమైనాననే. షేక్స్పియర్ సృష్టించిన ఈ పాత్రలందరు నిద్రాదేవత చూపు ఎంత చల్లనిదని, ఎంతగా శ్రమను బాపగలదని, ఎట్టి క్లేశాలపైనైనా ఎంత పూర్తిగా విస్మృతీ యవనికను లాగివేయగలదని, దాన్ని తలచుకొని తలచుకొని నిట్టూ ర్చినవారే. ఇందువల్లనే షేక్స్పియర్ నిద్రాదేవతావర ణంలో నేర్పులేనివాడని అనిపిస్తుంది. మరొక ఆంగ్లేయ కవి, అలెగ్జాండర్ పోప్, నిద్ర తన రెప్పలకు దూరమైందని స్పష్టంగా చెప్పుకున్నాడు. బాల్జాక్ రాతకోతలన్నీ రాత్రి పన్నెండు కొట్టినతర్వాతే చేసేవాడు. తెల్లవార్లూ గంటంలా దీపంపెట్టుకుని మాక్సిం గోర్కీ వ్రాస్తూకూర్చుంటే, ఏమి

కుట్రలు చేస్తున్నాడో అని జారిస్ట్ గూఢచారులు కన్నులలో కత్తులువేసుకుని కాపలాకాస్తుండేవారు. ఇటీవలి మన ఆంధ్ర రచయితలలో శ్రీ కందుకూరి వీరేశలింగంగారు కంటి నిండా నిద్ర నెరుగనివారే.

మహాకవిని కాను సరిగదా, నేను కవినైనా కాను. రచయితనే కాని, మహారచయితనని ఇచ్చకానికైనా ఇప్పటి కెవ్వరూ అనలేదు. అయినా, అదేమి పాపమో నాకు త్వరగా నిద్రపట్టదు. ఒకసారి నిద్రపడితేమాత్రం ఒకపట్టాన మెలుకువరాదు. పాడు సూర్యుడు పడిపోతున్నట్టు పరుగు పరుగున వచ్చి, వసారాలో పడుకున్న నా కళ్ళలోకి తన కిర ణాల సూదులతో పొడిచాడు. అందువల్లే చాలీచాలని నిద్ర వల్ల ఇంతగా బడలిక.





# ఆయం, గాయం

వేదాలు పౌరుషేయాలా? అపౌరుషేయాలా? అవి పౌరుషేయాలే అని డాక్టర్ భీమారావ్ అంబేడ్కర్ వాదం. తన వాదమే నిజమని ఏ హిందూనియోజకవర్గంలోనైనా ఆయన ఎన్నికకు నిలబడితేమాత్రం (అనుకూలంగా పడేవి నాబోటివారు ఏ నలుగురో వేసే నాలుగు వోట్లే కాబట్టి) ధరావతు మొత్తం దక్కదు. వేదాల కర్తృత్వం కనీసం కొందరి దృష్టిలోనైనా వివాదాంశంకావచ్చు గాని, సామెతలు నిస్సంశయంగా పౌరుషేయాలే. "పెద్దలు చెప్పినట్టు" అని ముందో, వెనకో తగిలించకుండా వాటిని ఉదాహరించడం సామాన్యంగా జరగనే జరగదు. అయితే, పెద్దలందరు సభ తీర్చి, తర్జనభర్జన పడి, ఖండనమండనలు చేసి, సామెతలను సృష్టించరు. వాటి కర్తృత్వం బహుళ జనులది కాదు; ఎవ్వనిదో వొక్కనిదే. ప్రాపంచిక జీవితానుభవం ప్రేరేపణవల్ల ఒక్కొక్కప్పుడు అప్రయత్నంగా ఒక్కొక్కని నోట వచ్చిన మాటకే - ఆ మాటవచ్చిన వేళావిశేషం మంచిదైతే - సామెతగౌరవం దక్కుతుంది.

నిప్పులో చెయ్యిపెట్టడం శుద్ధ తప్పు. ఆ తప్పుచేస్తే చెయ్యి కాలడం నిజం. ఏదో దోషంచెయ్యబట్టే దాని దుష్ఫలితాలను భోగిస్తున్నా, అది చెప్పుకోరాని తప్పిదమైతే, తాము ఏ పాపం యెరగకపోయినా తమకు సంకటాలు చుట్టుకున్నట్టు నాటకమాడేవారు లోకంలో లక్షోపలక్షలు. ఈ నాటకాన్ని చూస్తున్న ఏ పెద్దమనిషో, నిప్పుజోలికి పోనిదే చెయ్యి కాలదన్న సంగతి చప్పున జ్ఞప్తికిరాగా (ఆనాడో, ఆ క్రితంరోజునో పొరపాటున ఆయన చేతిని కాల్చుకోనివుండవచ్చు), "నిప్పు ముట్టనిదే చెయ్యి కాలదు" అని తలపంకించాడు. ఆ క్షణంలో ఒక లోకోక్తి ఆవిర్భవించింది. నిప్పు ముట్టనిదే చెయ్యి కాలదనడం ఎంత వాస్తవమైనా, ఆ మాట ముఖాన అనివేస్తే, నిర్దోషినన్నట్టు నటనచేస్తున్నవాడు సహించగలడా? అతడి దుస్సహానం చూచి, ఇంకొక పెద్దమనిషి "నిజమాడితే నిష్ఠురం" అంటూ తనదారిని తాను చక్కాపోయాడు. అప్పుడు మరొక సామెత ప్రపంచంలో పడింది. ఈయనవలె జారుకోడానికి వీలులేని వేరొక పెద్దమనిషి ఎప్పటికైనా అప్రియసత్యాన్ని చెప్పడం తనకు తప్పనప్పుడు దాగుడుమూతలు దేనికని "అంత్యనిష్ఠురం కంటె ఆదినిష్ఠురం మేలు" అని తాను చెప్పదలుచుకున్న దాన్ని కుండ బ్రద్దలగొట్టినట్టు చెప్పివేశాడు. ఆ ఘడియ, ఆ విఘడియ మరొక లోకోక్తికి జన్మలగ్నమైంది. ఈ విధంగా వేర్వేరు సన్నివేశాలలో ప్రాపంచికానుభవం

ప్రయత్నరహితంగా పలికించే సూత్రప్రాయపు పలుకులే లోకోక్తులన్నీ. నిఘంటువు లేమన్నా, వ్యాకరణా లేమి చెప్పినా, లోకం ఉక్తి లోకోక్తి అనుకోవడం పొరపాటు; లోకానుభవపు ఉక్తే లోకోక్తి.

అయితే, సర్వజనుల లోకానుభవం ఏకవిధమైంది కానేరదు. మానవప్రవృత్తులు విభిన్నం. ప్రవృత్తులలోని విభిన్నత్వంప్రకారం వివిధ మానవులవి విభిన్నానుభావాలు కావడం కద్దు. ఉదాహరణకు, దుష్టుని వేలెత్తి చూపమంటే ఆ పని ధర్మరాజుకు చేతకాలేదు; శిష్టుని వెదకి తెమ్మంటే అది దుర్యోధనుని తరంకాలేదు. దీనితర్వాత "తప్పులేనివారు ధరణిలో లేరు" అనే లోకోక్తి కర్తృత్వాన్ని ధర్మరాజుకు ఆపాదించగలమా? "ఎంచబోతే మంచమంతా కంతలే" అనే సామెత దుర్యోధనునిపోలిన వాని నోటినుంచే ఊడిపడిందని తీర్మానించుకోమా? దాతృత్వ గుణం వున్నవాడే, చేతికి ఎముక లేనివాడే "ఇస్తే చెడేది లేదు; చస్తే వచ్చేదిలేదు" అని చెప్పివుండాలి. ఆ ధర్మ బుద్ధి లేనివాడే, పైసా పోతే ప్రాణంపోయినట్లు గిజగిజలాడే వాడే "బెల్లంవుండేచోటే. ఈగలు ముసురుకునేది" అని ఈసడించివుండాలి. సౌమ్యుడైనవాడే "నోరు మంచిదైతే ఊరు మంచిదాతుంది" అని పలికివుండగా, పొగరుబోతు మాత్రమే "నోరువుంటే పోరు గెలుస్తాడు" అని ప్రల్లదించి వుండాలి.

ప్రవృత్తులలోని విభిన్నత్వమే కాక, జీవనోపాధికై చేసుకునే వృత్తులలోను, సంఘంలోగల ప్రతిపత్తులలోను కానవచ్చే విభేదాలుకూడా పరస్పర విరుద్ధమైన లోకానుభవాలకు, తద్ద్వారా పరస్పరవిరుద్ధ లోకోక్తులకు కారణభూతమౌతాయి. "కూలికి వచ్చి పాలికి మాట్లాడినట్టు" అని సామెత కట్టినవాడు కలవాడే అయివుండాలి; "దంచి నమ్మకు బొక్కిందే కూలి" అని కూలీనాలీచేసుకుని పొట్ట పోసుకునే కష్టజీవితప్పు మరొకరు అనివుండడానికి వీలే లేదు. "రాజుల సొమ్ము రాళ్ళపాలు", "రాజులు తలచుకుంటే దెబ్బలకు కొదవా?", "రాచపీనుగ తోడులేకుండా చావదు", "పెద్దపులి యెదటనైనా పడవచ్చుగాని, నగరివారి యెదట పడరాదు"—ఇత్యాది లోకోక్తులు ప్రజలకుమాత్రమే తోచినవి కాగా, "రాజు మెచ్చినది మాట, మగడు మెచ్చినది రంభ", "దెబ్బకు దెయ్యమైనా జడుస్తుంది", "కోల ఆడితే కోతి ఆడును" మొదలైనవి రాజులకు, లేదా, రాజబంధువులకు, రాజాశ్రితులకు వినా తదన్యులకు స్ఫురించివుండవు. "దండమయ్యా బాపనయ్యాఅంటే మీ తండ్రినాటి పాత బాకీ యిచ్చిపొమ్మన్నాడట", "బాపనవాని కొలువూ, తెల్లగుఱ్ఱపు కొలువూ కొలవకూడదు" వగైరా సామెతలు పుట్టడానికి బ్రాహ్మణులు కారకులు కావడం ఎంత అసంబద్ధమో, "మాలాయగారికి కోలాయగారు గురువు",

"మాలకూటికి లోబడ్డా పప్పుబద్ద దొరకదు" మొదలైనవి పంచములు సృష్టించివుండడం అంత అసంభవం.

విభిన్నవ్యక్తుల లోకానుభవాలలోని వైరుధ్యం లోకోక్తులలో విధిగా ప్రతిబింబిస్తుంది కనుకనే "కులమింటి కోతి అయినా మేలు" అని వొకటి సలహాచెప్పగా, "కోడలు నలుపైతే కులమంతా నలుపు" అని మరొకటి హెచ్చరిస్తుంది. "చదువుకున్నవాడికంటె చాకలివాడు మేలు" అని వొకటి వెక్కిరించగా, "విద్యావిహీనః పశుః" అని వేరొకటి నిర్దయగా నరుకుతుంది. "మొక్కై వంగనిదే మానై వంగుతుందా?" అని వొకటి శంకను వెలిబుచ్చగా, "తుళ్ళే ఎద్దే గోనె మోసేది" అని ఇంకొకటి ఉపశమనం కలిగిస్తుంది. "నమిలేవానికంటె మింగేవాడు దొడ్డవాడు" అని చెప్పేది, "పరుగెత్తి పాలుతాగేకన్న నిలుచుండి నీళ్ళుతాగడం మేలు" అని చెప్పేదానికి పూర్తిగా తలక్రిందులు. వెతకాలేకాని ఒక సామెతను ఖండించడానికి మరొకటి తప్పక దొరుకుతుంది. ఇంతమాత్రంచేత సామెతలను శుష్కవచనాలని త్రోసివెయ్యడానికి వీలులేదు. ప్రతి లోకోక్తిలోను కొంత సత్యం—అర్ధసత్యం—వుంటుంది. అది కొన్నిసందర్భాలకే, లేదా, కొందరు వ్యక్తులకే అతుకుతుంది.

సామెతలలో వుండేది సగం నిజమన్నసంగతి నాకు నెమరుకువచ్చింది పోయిన పక్షం రోజులలోనే. ఏనాడో

ఎడమపాదంపై పుట్టిన పుండుకు ఇక కత్తిచూపక తప్పదని డాక్టర్లు నిర్ణయించారు. వారి నిర్ణయంపై అప్పీలు లేదు కాబట్టి ఆపరేషన్ చేయించుకున్నాను. పాదానికి పాదం పెద్ద గాయమైపోయింది. కాని, "ఆయం తప్పితే గాయమంత సుఖంలేదు" అని మన సామెత ఆశపెడుతున్న సుఖంలో ఆవగింజలో అరవయ్యోవంతైనా నాకు కనబడ్డం లేదు. ఇందువల్ల ఈ సామెత చెప్పినవాడు వొట్టి సోమరిపోతు అనే నిశ్చితికి నేను రాక తప్పింది కాదు. పరమ బద్ధకస్థులుతప్ప తక్కినవారు ఈ సామెత నుదహరించలేరన్న తీర్మానానికి నేను వచ్చిందికూడా పోయిన పక్షంరోజులలోనే.

ఏ జబ్బుచేసినా, దానిమూలంగా ఎంతో కొంత బాధ తప్పదు. జలుబేమి, బిసాయిదేమి, అది చేస్తే కళ్ళవెంట నీళ్లు, ముక్కోళ్లవెంట నీళ్లు, దగ్గు, తలనొప్పి—ఎంత బెడద! రొంప ముదిరి కాస్త ఉష్ణం తగిలితే కాళ్లతీత, వొళ్లు నొప్పులు, నోరు చేదు—ఇట్టి కొత్తబాధ లెన్నో. ఇక, దీర్ఘవ్యాధులేవైనావస్తే అప్పుడు పడవలసిన యమయాతన పగవానికైనా వద్దు. కాగా, గాయం జబ్బేదీకాదు. తగిలేచోటు, తప్పేచోటు గాయానికి లేవనుకోండి. అందువల్లనే "ఆయం తప్పితే" అన్న షరతును సామెత పెడుతున్నది. ఆయువుపట్టులో తగులనంతవరకు, మరీ మోపుగా తగలనంతవరకు, కట్టు విప్పి దాన్ని తిరిగి కట్టినప్పుడు తప్ప (ఇదైనా కొత్త

లోనే) గాయం ఏ బాధా పెట్టదు. అయినా, గాయం వంక చెప్పుకుని మంచం యెక్కి మామూలుగా చేస్తుండే పని పాటలు తప్పించుకోవచ్చు; రాజాధి రాజువలె అన్నీ మంచం వద్దనే జరిపించుకోవచ్చు. గాయం పూడాలి కనుక సుష్టుగా భోజనం అమరాలని కోరవచ్చు. జీర్ణశక్తికివచ్చిన లోపం వుండదు కాబట్టి తినే ప్రతిముద్ద వర్రగా లోపలికి దిగుతుంది. కంఠపూర్తిగా ముప్పొద్దులా భోజనం చేసి, మంచం నడిమిని కూర్చుని, ఆత్మస్తుతి, పరనిందలతో కేవలం స్వర్గసుఖాన్నే అనుభవించవచ్చు. అందువల్లనే "ఆయం తప్పితే గాయ మంత సుఖం లే" దన్న సామెత పుట్టింది.

గాయం పేరుచెప్పి రాజాధిరాజభోగం వెళ్ళబొయ్యా లంటే రెండువిషయాలు ముఖ్యంగా కావాలి. ఒకటి, పైకం; రెండు, పరిచర్యచేసేవారు. ఈ రెండింటిలో మొదటిదే మరీ ముఖ్యం. చేతులో నాలుగుడబ్బులు గలగల లాడుతూ వుంటే పరిచర్యకు నిలబడేవారి కేమి కొదవ! చుట్టాలూ, పక్కాలూ హాజర్‌గా వచ్చి నిలబడతారు. దిండుసర్దేవా రొకరైతే, పక్కదులిపేవారు మరొకరు. పండు వలిచేవా రొకరైతే, దాన్ని నోటికి అందించేవారు మరొకరు. "ఉస్సో" అంటే చాలు విసనికర్ర అందుకునేవా రొకరు, వొళ్ళుపిసికేవారు మరొకరు. ఈ సపర్యలు బాధాకరంగా పరిణమించేవరకు జరిగినా జరగవచ్చు. ఇలా

హాజర్‌గా నిలబడే చుట్టాలూ పక్కాలూ లేకపోతే నౌకర్లను, చాకర్లను రూపాయికి మరొక రూపాయి పారవేసి ఎందరినైనా పెట్టుకోవచ్చు. ఇందువల్లనే "ఆయం తప్పితే గాయమంత సుఖంలేదు" అనే సామెతకు "ఆయముంటే గాయమంత సుఖంలేదు" అని పాఠాంతరంకూడా వున్నది.

అయితే, గాయానికి తగలవలసినవారు, తగలగూడని వారు అనే భేదాలు లేవు. అది ఎవరికైనా తగలవచ్చు; ఎవరైనా దానికారణంగా మంచం యెక్కవలసిరావచ్చు. ఇలా మంచంపట్టేవా రందరు ఆయానికి కొదువలేకపోయినా పనిదొంగలు కాకపోవచ్చు. "తిట్టే నోరు, తిరిగే కాలు వూరుకోవు" అని చెప్పనే చెప్పారు. చేసే చెయ్యీ ఇదే మాదిరిగా వూరుకోలేదు. పని అంటే కొందరికి ఎంత బెంగో, పనిలేకపోతే కొందరికి అంత బెంగ. పనిలేకపోతే, వారికి అసలు బ్రతుకే లేనట్టుగా వుంటుంది. పింఛను పుచ్చుకోమంటే కొందరికి ఎంత సంకటంగా వుంటుందో చూడండి. సర్వీసు గడువు దాటినా, ఏడాదితర్వాత ఏడాదిచొప్పున వీలైనన్ని పొడిగింపులకోసం తాపత్రయపడతారు. గత్యంతరంలేక చివరికి పింఛనుదారుల ముఠాలో చేరినా, ఎంతో కాలం ఫించను తినబోరు. రోగం రొష్టూ కనబడదు. అయినా రోజురోజుకు శుష్కించిపోతారు. శరీరదార్ఢ్యంతో పాటు మానసిక పాటవంకూడా త్వరత్వరగా సన్నగిలి

పోతుంది. దేనిపైనా శ్రద్ధపెట్టలేరు; ప్రతిదానిలోనూ వెలితే కనబడుతుంది. దినం యుగంగా గడుపుతూ, ఏదో ఒకనాడు హఠాత్తుగా వెళ్ళిపోతారు. "గుండె జబ్బు" అని ఇందుకు సర్వసాధారణంగా కారణం చెబుతారు. నిజమే! చేసేచేతికి చేతిలో పనిలేకపోతే అది గుండెను ఎంత క్రుంగదీసివేస్తుంది!

పనిలేకపోతే పిచ్చియెత్తే నాకు ఈ పక్షంరోజుల సోమరితనం నాపాలిట నరకమే అయింది. దానినుంచి కాస్సేపైనా తప్పించుకోడానికి చేసిన ప్రయత్నమే ఈ వ్యాసం. పెద్దలు సామెత చెప్పినట్టు, ఇది "పనిలేని మంగలి పిల్లితల గొరగడం" కాలేదుగదా? ఇక్కడ మరొక సందేహం. పెద్దలన్నమాట "పనిలేని మంగలి పిలిచి తలగొరిగాడు" అని కాదుగదా?



## "తెలుగులెస్స"



"అబ్బ!"...ఉద్దేశం అంతర్జాతీయ రాజకీయాలను గురించి వ్యాసం వ్రాయాలని. మరొక ప్రపంచ యుద్ధభయం, ఆ యుద్ధానికి విపులసన్నాహాలు, ఇంతలోనే ఈ మహోపద్రవం తిరిగి దాపురించడానికి మీరు కారణమంటే మీరు కారణమని పరస్పరారోపణలు —— వీటిని విడిచిపుచ్చితే నేడు అంతర్జాతీయ రాజకీయాలు దాదాపు శూన్యం. ఇందువల్ల "ప్రపంచం ఇంచుమించు రెండు స్కంధావారాలుగా విభాజితమైపోయింది. ఒక పక్షాన్నిమించి మరొకటి పెద్ద సైన్యాలను కూర్చుకొనడానికి ప్రయత్నిస్తున్నది; ఒకదానిపై పోటీగా మరొకటి ఘోర మారణాయుధాలను కూర్చుకొంటున్నది; ఒకదానిచుట్టు మరొకటి యుద్ధాశ్రయాల సేకరణకై పట్టుదల చూపుతున్నది. మరొక మహాయుద్ధం కారుమేఘాలు క్రమ్ముకొనివస్తున్నవి. తూర్పున అప్పుడే ధగధగ మెరుపులు, ఫెళఫెళ ఉరుములు..." ఇట్టి ధోరణిలో ఈ వ్యాసం బహుశా ప్రారంభమై వుండవలసింది. మరొక విధంగా ప్రారంభిస్తే పెక్కుమంది పాఠకుల దృష్టిలో అది పకడ్‌బందీ మెత్తుగడ కాబోదు.

కాని, వ్రాయడానికి కూర్చుని, కాగితంపై నేను కలం పెట్టేసరికి అప్రయత్నంగా దొర్లిన మొదటిమాట "అబ్బ" అని. పొద్దస్తమానం పని చేసిచేసి పూర్తిగా అలిసిపోయిన నా అంగాంగం—నాలోని ప్రతి జీవకణం—విడిచిన నిట్టూర్పే నాకు తెలియకుండా నా కలం వ్రాసిన ఈ "అబ్బ" అయివుండాలి.

"అబ్బ" అనే మాటలోని గొప్పతన మిదే! ఆ పదం మన ప్రవృత్తిలోనే అంతర్లీనమై వుంటుంది. అది మనతో పుడుతుంది; మనలో పుడుతుంది. నోరు లేని పసిపాపకూడా "అబ్బబ్బబ్బబ్బ" అని అంటుంది. చూడగా భాషకు అసలు పునాదే ఈ "అబ్బ" అనే పదమేమో అని తోస్తుంది. పసిపాప "అబ్బబ్బబ్బబ్బ" అని కేరింతలాడుతూవుంటే, మేన మామ "నీ అబ్బ" అని పరిహాసమాడతాడు. అట్టి సమ యంలో తన భాషాపరిజ్ఞానంకూడా ఈ "అబ్బబ్బబ్బబ్బ" తోనే ప్రారంభమైందని అతడికి గుర్తురాదు. ఈనాటికైనా తన సమస్త మానసికావస్థలను ఈ పదప్రయోగంతోనే తాను వ్యక్తపరుస్తూవుంటాననీ అతడికి స్ఫురణకు రాదు. తనకు బాధ కలిగితే, అతడు "అబ్బ" అని మూలుగుతాడు. కోపం వస్తే, "అబ్బ" అని గద్దిస్తాడు. విసుగు పుడితే, "అబ్బ" అని కసురుతాడు. దుఃఖం వెల్లుబికితే, "అబ్బ" అని నిట్టూరుస్తాడు. కష్టాలు తీరితే, "అబ్బ" అని గుండె

తేలికపరుచుకుంటాడు. జుగుప్సాకరమైన దృశ్యంనుంచి "అబ్బ" అంటూ ముఖం తిప్పివేసుకుంటాడు. ఇంతే కాదు. అందమైన పువ్వు కనబడితే, "అబ్బ! ఎంత అందంగా వుంది" అని మెచ్చుకుంటాడు. ఎండలో మాడి మాడి నీడను చేరినంతనే "అబ్బ! ప్రాణం ఎంత హాయిగా వుంది" అని సంతోషిస్తాడు. ఆతురతను ప్రకటించాలన్నా, ఆశ్చర్యాన్ని ప్రదర్శించాలన్నా "అబ్బ" తిరిగి శరణ్యమౌతుంది అవహేళన చేయగోరితే ఈ పదాన్నే స్వల్పంగా మార్చి "అబ్బో!" అంటాడు. బాధలో, కోపంలో, లేదా, విసుగుదలలో తరతమభేదాలను చూపించాలంటే తిరిగి "అబ్బబ్బ" అంటాడు. ఇంతదూరం చెప్పడందేనికి? అతడు "అబ్బ" పదప్రయోగంచేయని సందర్భాలు బహు స్వల్పం; దాదాపు లేవనే చెప్పవచ్చునేమో!

అయినా తానింతగా ఈ పదాన్ని ప్రయోగిస్తున్నానని అతడంగీకరించడు. "అబ్బ" పెదవులనుంచి రాదు; కడుపులో నుంచి వస్తుంది. దానిస్థానం నిఘంటువులలోకంటె మిన్నగా నరాలపట్టులోనే. అందుచేత దాని ప్రయోగం ఆలోచనాపూర్వకంగా కాదు; సహజంగా. దాని వినియోగం ప్రయత్నఫలితంగా కాదు; సంకల్పానికి అతీతమైన శక్తుల ప్రేరేపణద్వారా. ఎంత దీర్ఘసమాసాలైనా, ఎంతటి క్లిష్టసమాసాలైనా, అవి అన్నీ ఒక యెత్తు; ఇది ఒక్కటీ ఒక యెత్తు.

ఆ సమాసాలు ఎంత కృత్రిమమో, అంత పేలవం; ఇది ఎంత సహజమో, అంత అర్థవంతం. సరియైన పట్టులో వాడుకోవడం తెలిసివుండాలే గాని, "అబ్బ" అనే ఒక్క ముక్కముందు "అమందానందకందళితహృదయారవిందుడు" "మందహాసకందళితముఖారవిందుడు" మొదలైన నోరు తిరగని సమాసాలన్నీ కేవలం దిష్టిపిడతలే.

"అబ్బ" అనే పదంవలె "అమ్మ" అనేదికూడా మనలో పుట్టిందే. దానివలె దీన్నికూడా ఎన్నో అర్థాలలో, ఎంతో భావగర్భితంగా ప్రయోగించవచ్చు. నిజానికి దానికంటె ఇదే హెచ్చు పటుత్వంవున్న పదం. నడుంవిరిగేపాటి పెద్ద కష్టాలేవైనా చుట్టుకోనగా, "అబ్బ" అని నిట్టూర్చినప్పటి కంటె, "అమ్మ" అని దీర్ఘనిశ్వాసాన్ని విడిచినప్పుడు గుండెలపై బరువు త్వరగా తగ్గుతుంది. నరాలనుపట్టిన పాడుజబ్బులేవో ప్రాణాలను తోడివేస్తుండగా "అబ్బ" అని మూలిగినప్పటికంటె "అమ్మ"అని పక్కకు వొత్తిగిలినప్పుడు ఎక్కువ బాధోపశమనం కలుగుతుంది. "అమ్మ"ను మించి ఆప్యాయమైనమాట మరొకటిలేదు కనుకనే కొందరు పెద్దవారు, ముఖ్యంగా, పాతకాలపువారు, లింగభేదాన్నికూడా పాటించక "నీ పేరేమిటమ్మా? నీవేమి చదువుకొంటున్నావమ్మా?" అని మగపిల్లలనే నోరారా పలకరిస్తారు. "అమ్మ" ఎంత రాతిగుండెకైనా రాచబాట కాబట్టే గిద్దెడు గింజలైనా

పుట్టని ఈ గడ్డురోజులలోకూడా "అమ్మా! సందాకవళం" అంటూ బిచ్చగాళ్ళు పదిగడపలకు తిరిగి ప్రాణాలు నిలుపుకో గలుగుతున్నారు. మన గుండెలపై రాజ్యాన్ని చెయ్యగోరే మహాకవుల చేతులలో ఈ రెండక్షరాల చిట్టి పొట్టి మాట తిరుగులేని బ్రహ్మాస్త్రమే! పోతనామాత్యుడు—

అమ్మా మన్నుదినంగ నే శిశువనో,
యాఁకొంటినో, వెఱ్ఱినో,
నమ్మంజూడకు వీరిమాటలు మదిన్,
నన్నీవు గొట్టంగ వీ
రిమ్మార్గంబు ఘటించి చెప్పెదరు...

అని అల్లరికాన చిన్ని కృష్ణుడిచేత అనిపించేసరికి చెంపపై ఒక చరుపు చరచడానికి యెత్తినచేతిని యెత్తినట్టే మిగిల్చే పాటిగా యశోదాదేవి తన కోపాన్ని మరచిపోవడమే కాక, ఆమెతోపాటు మనంకూడా కరిగిపోతాము. తిక్కనా మాత్యుడు "అమ్మా నినునమ్మి చాల విషమంబగు నివ్వన వాస మీతఁడుం బూఁనగ నియ్యకొంటి"నని అరణ్యావాస ప్రయాణసందర్భంలో కుంతీదేవిచే సహదేవుని ద్రౌపదికి ఇల్లడపెట్టిస్తుండగా, కన్నప్రేమకంటె పెంచినప్రేమ ఎంత ఎక్కువని ఒక్కసారి తలపుకు రాగా, కడగొట్టు కొడుకును వీడలేక వీడలేక వీడుతున్న ఆ తల్లికివలె మనకుకూడా "బోరన నశ్రులుగ్రమ్ము"కొంటవి. ఇష్టదేవతాది ప్రార్థన

పద్యాలు లెక్కలేనన్ని వుండగా, ప్రత్యేకించి దుర్గకు మ్రొక్కులిడిన వెన్నో వుండగా—

అమ్మల గన్నయమ్మ, ముగు
రమ్మల మూలపుటమ్మ, చాలఁ బె
ద్దమ్మ, సురారులమ్మకడు
పాఱడిపుచ్చినయమ్మ, దన్ను లో
నమ్మిన వేల్పుటమ్మల మ
నమ్ములనుండెడియమ్మ దుర్గ మా
యమ్మ......

అని భాగవతంలో వున్నదే మన హృదయాలకు పూర్తిగా హత్తుకుపోవడం "అమ్మ" పదంలోగల అందా లన్నింటిని అది పుణికి పుచ్చుకున్నందునే.

"అమ్మ", "అబ్బ"లతో పోల్చదగింది కాకపోయినా, "ఇది" సయితం ప్రత్యేకంగా యెన్నదగిందే. ఎక్కడ ఏ మాట తోచకపోయినా దాన్ని రామబాణంవలె సంధించ వచ్చు; ఎక్కడ ఏ చిక్కు ఎదుర్కొన్నా దాన్ని విష్ణుచక్రం వలె అడ్డువెయ్యవచ్చు. ఒక ఉదాహరణ చూడండి: "నాకు అసలే ఇదిగా వుండగా నువ్వు మరింత ఇది చేశావంటే, నేను అసలే ఇదైపోతాను." ఈ వాక్యంలో "ఇది" వచ్చిన మూడుచోట్ల దానికి ముప్పూరు విడివిడి అర్థాలు చెప్పుకో వచ్చు. మొదటి "ఇది" మనస్సు చికాకు మొదలుకొని మిన్నువిరిగి మీదపడినంతటి మహాకష్టంవరకు ఏదైనా

కావచ్చు. రెండవ "ఇది" తాటాకులు కట్టడం మొదలు కొని తంటాలు తెచ్చిపెట్టడంవరకు ఏదైనా కావచ్చు. మూడవ "ఇది" మరింత క్రుంగిపోవడం మొదలుకొని కన్నీళ్ల పర్యంతం ఏదైనా కావచ్చు. ఊహకు ఇంత "ఇదిగా" అవకాశమివ్వడమే ఈ "ఇది" మాటలోని గొప్పతనం. ఇంత "ఇది"గా మనకు చక్కచక్కని మాట లుండగా అయినచోట, కానిచోట సంస్కృత సమాసాలను **వాడి** తేటతెలుగును—అబ్బ!—ఎంత పాడుజేస్తున్నారు! ఇందు వల్ల "దేశభాషలందు తెలుగు లెస్స" అనే ఘనతకు చేతు లారా—అమ్మ!—ఎంత మచ్చతెస్తున్నాము...ఏదో ఇదిగా నడవవలసిన ఈ వ్యాసం మరొక ఇదిగా నడిచింది. ఏమైనా అక్కడికి అది ఒక ఇదే కదండీ!





# సందేశాలు

"మా గ్రామ గ్రంథాలయ రజతోత్సవం, మా ఫిర్కా యువజన మహాసభ 15 వ తేదీని జరుపుతున్నాము. రెండింటికి రెండు సందేశాలు మీరు తిరుగు టపాలో పంపించాలి. మాకు ఆశాభంగం కలిగించరనే మనస్ఫూర్తిగా ఆశిస్తున్నాము"— ఇది నిన్న నా మిత్రులొకరు వ్రాసిన లేఖ.

యుద్ధంవల్ల * కలిగిన శతమానం చిక్కులలో జాబులు వేళకు చేరకపోవడ మొకటి. నిన్నటి నా ఉత్తరంసంగతే చూడండి. తిరుగుటపా వేళ మించిపోయిన తర్వాత గాని అది నాకు అందలేదు. ఏమైనా, ఏదో ఒక వేళకు నిన్ననే చేరింది. అక్కడి కది చాలా నయం. తన తొందరపాటుకొద్దీ నా స్నేహితుడు టెలిగ్రాం పంపించివుంటే అది ఈనాటికైనా వచ్చేదో, లేదో! పాన్నేరిలో ఒక పెద్దమనిషి ఏప్రిల్ 16 వ తేదీనా డిచ్చిన టెలిగ్రాం మే 28 వ తేదీకి కాని మద్రాసు చేరలేదట! ముక్కాలు ముదుసలైనా ఈ వ్యవధిలో పాన్నేరి, మద్రాసులమధ్య తొంభైతొమ్మిది సార్లు ఆసులో గొట్టం తిరిగినట్టు గిరగిర తిరిగివుండేది.

---

* ఈ వ్యాసం తొలిప్రచురణ 1941—42 ప్రాంతాలలో.

అయితే, నా స్నేహితుడు కోరినట్టు నేను నిన్న సందేశం - పొరపాటు సుమండీ! - సందేశాలు పంపించకపోవడానికి కారణం, ఆయన జాబు తిరుగుటపా వేళదాటిపోయిన తర్వాత చేరడం కాదు. కావాలంటే నేను దీన్ని నా స్నేహితునికి ఒక సాకుగా చెప్పవచ్చుననుకోండి. ఎన్ని చికాకులను తెచ్చి పెట్టినా, మరెన్ని చిక్కులను మెడకు చుట్టినా సాకువిషయంలో మాత్రం యుద్ధం మహోపకారం చేసింది. "ఏం! తోటకూరకూ అంత గిరాకీ వచ్చిందీ! - మండబెట్టుకుంటున్నావ్!". "యుద్ధమొచ్చిందిగా, దొరసానమ్మా! - జర్మనోడి యుద్ధం". "ఇదిగో యిస్తానని చేబదులు పట్టుకుపోయి ఎన్నాళ్ళైందిరా, తమ్ముడూ?". "ప్రపంచం తలకిందులౌతుంటే ఇప్పుడేమిటయ్యా నీ తొందర!". "ఏమండీ! పిల్లలకు బట్టలు బొత్తిగా చిరిగిపోయాయ్". "అఘోరించండి! గజంపావలా గుడ్డ రూపాయిపెట్టినా దొరకడం లేదు. గుడ్లు ఇప్పటికే వెళ్ళకొస్తున్నాయి - అదేమైనాసరే నావల్ల కాదు". "ఆఫీసుకు ఇంత లేటుగా దయచేశారేమండీ, సార్?". "పెళ్లాం బిడ్డల్ని ఊరు పంపించివేశానుగదండీ! హోటల్వాడు పిండాకూడు వేళకు పెడితేనా? నన్నేమి చావమంటారు!"—ఈవిధమైన సంభాషణలు మనం ఈనాడు ఎన్ని వినడంలేదు? ప్రతివిషయానికి, అది చిన్నదైనా, పెద్దదైనా, తిరుగులేని సాకుగా యుద్ధం ఉపకరిస్తున్నది. ఈ దృష్టినుంచి చూడగలవారికి అది "అక్కరకురాని చుట్టం" ఎంతమాత్రం కాదు.

పుణ్యకాలం దాటిపోవడం నేను సందేశాలు పంపకపోవడానికి కారణం కాదంటే మరేమిటని అడుగుతారా? దాపరికంలేకుండా చెప్పాలంటే — లౌక్యం. ఔను, లౌక్యమే! మాట తబాబుకు, మోసానికి "లౌక్యం" అనే పేరు ఇప్పుడు పెట్టబడుతున్నా, నూరేళ్ళక్రితం కూడా దానికి ఈ దుష్టార్థాలు వున్నట్టు తోచదు. ఉద్యోగ సద్యోగాలు, ప్రాపంచిక వ్యవహారాలు — ఇట్టి అర్థాలనే దానికి సి. పి. బ్రౌన్ వ్రాశాడు. "అతనికి యిప్పుడు లౌకీకము లేదు" అంటే "అతనికి యిప్పుడు ఉద్యోగము లేదు" అని వివరించాడు. "నేను విశేష లౌకీకుడను కాను" అంటే "ప్రాపంచిక వ్యవహారాలు అంతగా తెలిసినవాడను కాను" అని మరొక వివరణ వ్రాశాడు. రానురాను మరొకరితో వ్యవహరించడమే మోసంచెయ్యడంగా, లేదా, చేయించుకోవడంగా పరిణమించినందువల్ల కాబోలు, "వాడు మహా లౌక్యుడు" అంటే "మహా తెలివితేటలుగల మోసగాడు సుమీ!" అనే ధ్వని వస్తున్నది. అయితే, మనం చేసే మోసం లౌక్యం; ఇతరులుచేసే లౌక్యం మోసం. సందేశాలు పంపించకపోవడంలో నేనుచూపిన లౌక్యంమాత్రం ఈ తరహాది కాదు; దాని చెహరాయే వేరు.

అడిగినవెంటనే కొందరు సందేశం పంపిస్తారు; అడగకుండాకూడా కొందరు పంపిస్తారు. సందేశం అడిగించుకోవడం, దాన్ని పంపించడం, ఫలానావారు పంపిన సందేశం

ఫలానా సభలో సన్మానసంఘ కార్యదర్శి ఫలానావారిచే చదవబడిందని తర్వాత పత్రికలలో ప్రకటన జరగడం — దీనిలో ఎంత పబ్లిసిటీ వున్నది! ఒక్కొక్కప్పుడు బుద్ధిహీనుడై ఆ సన్మాన సంఘ కార్యదర్శి సందేశాలన్నింటినీ సభలో చదవక, చాలా చాలామంది సందేశాలు చేరినవని ఒక్క ముక్కలో కొట్టివేస్తాడనుకోండి. అన్ని సందేశాలు చదివి తీరాలన్న పట్టుదలను అతడు చూపితే, సభలోనుంచి "ఆలస్యమైపోతున్నది — మరి చాలు లేవయ్యా!" అని అల్లరి రావడంకూడా కద్దే అనుకోండి. ఇలాంటి గొడవ లేవైనా జరిగితే, మన సందేశం కార్బన్ కాపీని జాగ్రత్త పెట్టుకుని దాన్ని మనమే ఏ పత్రికకైనా పంపించి అచ్చుగుద్దించుకో వచ్చు. అయినప్పుడు సందేశం పంపించడం లాభ్యమా? పంపించకపోవడం లాభ్యమా? స్థూలదృష్టికి పంపించడమే కాని, శాస్త్రలోతుకు దిగి ఆలోచిస్తే పంపించకపోవడమే.

"సందేశము" అనే పదానికి "శ్రీశబ్దరత్నాకరము అను నీ యకారాది యాంధ్రనిఘంటువు"లో "సమాచారము" అని అర్థమిచ్చారు. దమయంతి ప్రేమసమాచారాన్ని నలునికి మూటకట్టుకువచ్చింది హంస కనుకనే, అది తెచ్చిన వర్తమానం "హంస సందేశ"మైంది. శాపగ్రస్తుడై వింధ్యపర్వతాలలో ప్రవాసిగావున్న యక్షుడు తన విరహవేదనా సమాచారాన్ని అలకాపురిలోని తన ప్రియురాలికి అందజేయవలసిందిగా మేఘుని వేడుకున్నందునే

కాళిదాసు కావ్యం "మేఘసందేశ" మైంది. కాని, సభల సందర్భంలో సందేశాన్ని ఈ అర్థంలో మనం ప్రయోగించము. సభానిర్వాహకులుగాని, సభాసదులుగాని మన క్షేమసమాచారాలు కోరరు; వారి యోగక్షేమాలను మనం విచారించేదీ లేదు. కవరు అణన్నర అయిపోయినతర్వాత బంధుమిత్రులమధ్యే పరస్పర కుశలప్రశ్నలు తగ్గిపోయాయి. సభానిర్వాహకులు మనలను కోరేది సభకు శుభలగ్నం ఏదనే సమాచారంకూడా కాదు. లగ్నాలలో నమ్మకం వుండి వాటి సమాచారం తెలుసుకోవాలంటే వారు ఏ పురోహితునివద్దకో, ఏసిద్ధాంతివద్దకో వెడతారు. అందుచేత సభకు సందేశం పంపించవలసిందిగా లేఖ వచ్చినప్పుడు దాని భావం సభలో చర్చకురానున్న ముఖ్యసమస్యలను గురించి వాటి పరిష్కారానికి తోడ్పడగలవిధంగా మీ అభిప్రాయాలను సాకల్యంగా, కాని, సంగ్రహంగా తెలియజెప్పండనిమాత్రం.

లోకంలో ఎన్ని విధాలైన జాడ్యా లున్నాయో అన్ని విధాల సభలుకూడా వున్నాయి. సాంఘిక సభలు, ఆర్థిక సభలు, రాజకీయ సభలు, సహకార సభలు, సారస్వత సభలు, బ్రాహ్మణ సభలు, బ్రాహ్మణేతర సభలు, నియోగి సభలు, వైదీకి సభలు, స్త్రీల సభలు, సినీ ఫ్యాన్స్ సభలు, సనాతనధర్మ సభలు, హరిజన సభలు, ఉద్యోగుల సభలు, నిరుద్యోగుల సభలు, కార్మిక సభలు, కర్షక సభలు, కాందిశీక సభలు, లాయర్ల సభలు, డాక్టర్ల సభలు, రైలుప్రయా

ణీకుల సభలు, అఖిలభారత సభలు, రాష్ట్రీయ సభలు, జిల్లా సభలు, తాలూకా సభలు, ఫిర్కా సభలు, గ్రామ సభలు, శివారు సభలు—అమ్మయ్యో! వీటికి అంతూ దరీ లేదు. 1929 నాటి లాహోర్ అఖిలభారత కాంగ్రెస్ మహాసభ సందర్భంలో కాబోలు, జేబుదొంగతనాలు విపరీతంగా జరిగాయి. అప్పుడు ఒక స్థానిక దినపత్రిక "అఖిల భారత జేబుదొంగల మహాసభ" అని చమత్కారంగా హెడ్డింగ్ పెట్టింది! ఇంతకూ చెప్పవచ్చిన అసలు సంగతి ఏమంటే, తలమీది వెంట్రుకలన్నిసభలు జరుగుతూవుంటాయి. వాటిలో లక్షోపలక్షల వ్యవహారాలు చర్చకు వస్తూవుంటాయి. వాటి నన్నిటినీగురించి మనకు తెలిసివుంటుందా? తెలియనప్పుడు ఏదో సందేశం పంపించి మన తెలివితక్కువ బయటపెట్టు కోవడం లాక్యం కాగలదా?

నన్నడిగితే మనకు తెలిసిన విషయాన్నిగురించికూడా సందేశం పంపరాదంటాను. ఏమో తెలుసునంటే తెలుసు నన్నట్టుకాక తక్కినవారికంటె మనకు ఎక్కువగా తెలిసి వుండాలి. ఇది కాకపోతే, తక్కినవారు చెప్పలేని ఫక్కీలో చెప్పదలుచుకున్నదాన్ని చెప్పగల సత్తా వుండాలి. ఈ రెండింటిలో ఏ ఒక ప్రత్యేకతైనా వుండడం చాలా చెదురు. అయినప్పుడు సందేశం పంపించి "ఓస్! ఈపాటివాడేనా!" అనిపించుకోవడంకంటె "సందేశం పంపించేవుంటే ఎంత

గొప్పదాన్ని పంపించివుండేవాడో?" అన్న బెట్టుమిగుల్చు కోవడం మెరుగుకాదా?

సందేశానికి మనం సరైన అర్థాన్ని చెప్పుకున్న పక్షంలో దాన్ని యివ్వగలవారు శతాబ్ది కొక్కరైనా జన్మిస్తారో, లేదో! అట్టివా రిచ్చే సందేశం కేవలం వాగ్రూపంలో వుండదు; వారి జీవితాలుకూడా దాన్ని ఘోషిస్తాయి. కష్టనిష్ఠురాల నెరుగకుండా, కడుపులో చల్ల కదలకుండా, వారు తమ సందేశం వినిపించరు; మతపీఠంపై బైఠాయించి, లేదా, సభావేదికపై సుఖాసీనులై, కాదా, సంఘపూజితు లౌతూ వారు తమ సందేశం వినిపించరు. సర్వసంగ పరిత్యాగంచేసిన ఒక గౌతమబుద్ధుడు, విషపాత్రికను అమృత కలశంవలె స్వీకరించిన ఒక సోక్రటీస్, "తండ్రీ! వీరిని క్షమించు. తా మేమి చేస్తున్నదీ వీరికి తెలియదు" అనే ప్రార్థనతో శిలువనెక్కిన ఒక ఏసు క్రీస్తు, భరతఖండ ఏక చ్ఛత్రాధిపత్య సాధనయత్నాన్ని విజయపరంపరమధ్య ఐచ్ఛికంగా విరమించిన ఒక అశోకుడు, నమ్మినదాన్ని చాటి నందుకు మరణదండన పొందినపిమ్మటకూడా "నా బ్రతుకును మాపగలరేమో కాని, నా నమ్మకాలను చెరిపివెయ్యగలరా!" అని ధీరంగా పలికిన ఒక బ్రూనో, నమ్మకాలకై దారిద్ర్యాన్ని వరించిన ఒక మార్క్స్, అందుకు ప్రాణాలనే వొడ్డిన ఒక లెనిన్, ఒక గాంధి—ఇట్టివారే సందేశ మివ్వగలవారు. వీరి సందేశం సభలకే కాదు, సమస్తావనికీ, సర్వకాలాలకూ.

తక్కినవారు "తగుదుమమ్మా" అని సందేశ మివ్వబోతే ఒక కాంగ్రెసు ప్రధాని చేసినట్టు (ఆయన పేరు బట్టబయలు చేయడం భావ్యం కాకపోవచ్చు) వెర్రి వెంగళప్పతనాన్ని చాటుకోవడమే కావచ్చు. మూడు, నాలుగేళ్ళనాడు మద్రాసులో జరిగిన అఖిల భారత స్వదేశీవస్తు ప్రదర్శనానికి తంతిద్వారా (బహుశా ప్రభుత్వం ఖర్చుతోనే) "ఖద్దర్ పుట్స్ ఎ ప్రీమియం ఆన్ అనెంప్లాయ్‌మెంట్" అని ఈ ప్రబుద్ధుడొక మహత్తర సందేశం పంపించాడు. "దీని భావమేమి తిరుమలేశ?" అంటే "ఖద్దరు నిరుద్యోగానికి దోహదమిస్తుంది" అని. ఆ ప్రదర్శనం కార్యదర్శి గుడ్డిగా దీన్ని సభలో చదివేసరికి సభికులు ఘొల్లుమన్నారు. కాని, ప్రదర్శనం ప్రారంభోత్సవానికి అధ్యక్షతవహిస్తున్న శ్రీమతి సరోజనీ నాయుడు అద్భుత సమయస్ఫూర్తితో ఆ కాంగ్రెస్ ప్రధాని పరువు నిలిపింది. "ఛీ! ఈ పెద్దమనిషికి ఎంతటి దద్దమ్మ ప్రయివేట్ సెక్రటరీగా దొరికాడు!" అని నోరూవాయీలేని తాబేదార్‌పై ఆమె నెపాన్ని నెట్టివేసింది.





# మామిడిపండు

అన్ని పండ్లలో ఏ. పండు పెద్దదని సిద్ధయ్యగారు పృచ్ఛ చేస్తారు. అన్ని పండ్లలో ఎరుకతెలిసిన తలపండు పెద్దదని బ్రహ్మంగారు ప్రత్యుత్తరమిస్తారు. బ్రహ్మంగారిలో వేదాంతం ఒక మోతాదు తక్కువై, రసజ్ఞత రెండు మోతాదులు ఎక్కువైవుంటే దూదేకుల సిద్ధయ్యగారి ప్రశ్నకు ఎరుకతెలిసిన తలపండు అని కాక, ఎర్రగా ముగ్గిన మామిడిపండు అని జవాబు చెప్పివుండేవారు. కొంచె కటువు సామెతే కాని "ఎద్దేమి యెరుగురా అటుకులచవి, గాడ్దేమి యెరుగురా గంధపొడివాసన" అన్నట్టు, బైరాగుల కేమి తెలుసు పండ్ల రుచులు! రుచులు తెలిసినవారైనా, తెలిసీ వాటిని చంపుకో గలవారైనా అసలు బైరాగులలో కలుస్తారా?

రుచులవిషయం అడగవలసింది భోగులను కాని, త్యాగులను కాదు. భోగులను చెప్పాలంటే రాజులనే చెప్పాలి; రారాజులనే చెప్పాలి. లేదా, తరాజులైనా, రాజులవలె, రాజాధిరాజులవలె బ్రతకనేర్చినవారిని చెప్పాలి. ఇట్టివారి

మెప్పును మామిడిపండు పొందనే పొందింది. జహాంగీర్ మెప్పును పొందబట్టే ఒకజాతి మామిడిపండుకు "జహాంగీర్" అని పేరు వచ్చివుండాలి. జహాంగీర్ లెక్కేమిటి? ఆయన తాతలే మామిడిపండుకు ముగ్ధులైనారని చెప్పవచ్చు. హుమాయుద్దీన్ చేత "భేష్" అనిపించుకున్నందునే ఒకరకం మామిడిపండు నాటికీ నేటికీ "హుమాయుద్దీన్". జహాంగీర్ తండ్రి, అక్బర్, తన పేరును ఏ మామిడిపండుకు విడిచివెళ్లక పోయినా, ఆ మొఘల్ పాదుషాకూడా దానిరుచి మరిగిన వాడే. మామిడిపండ్లపై మనస్సుపోతే ఆయన కనీసం ఒక పరకపళ్లు చులాగ్గా ఊదివేసేవాడు. ఒక రోజు బీర్‌బల్‌తో చేరి ఆయన మామిడిపళ్ళ ఫలహారానికి కూర్చున్నాడు. పండుతర్వాత పండును శుభ్రంగా భోంచేసి టెంకలను బీర్‌బల్ ముందుకు నెట్టివేశాడు. తర్వాత మొత్తం టెంకలను ఎంచి "బీర్‌బల్! నీవెంతటి కడుపాత్రపువాడవోయ్! రెండు పరకలపళ్ళు గుటుక్కుమనిపించావ్! జబ్బుచేస్తుందేమో సుమీ!" అని చమత్కరించాడు. "హనుమంతుని ముందు కుప్పిగంతులా!" అన్నట్టు బీర్‌బల్ వద్దనా ఇలాంటి చమత్కారాలు చెల్లేది. ఆవలిస్తే పేగులు లెక్కపెట్టగల గడసరి; మాటకుమాట అప్పజెప్పగల గడుగ్గాయి. "చిత్తం, స్వామీ! నేను కడుపాత్రపువాడనే. అయినా, టెంకలను విడిచిపెట్టాను. దేవరవారు వాటినికూడా చిత్తగించారు" అని చల్లగా చురక తగిలించాడు. మామిడిపండు రుచి

నెరిగిన రసజ్ఞుడు కనుక, అగ్బర్ పాదుషా తనకు అంటిన చురకకు నొచ్చుకోక ఫక్కున నవ్వివుండాలి.

దొరకని యేడుపేకాని దొరికితే ఏరాజులైనా రసాలానికి రంజిల్లుతారు. స్పెయిన్ రాజులు గుమ్మైన పండుకాబట్టే కాబోలు, రత్నగిరిలో పండే మామిడిపండుకు "ఆల్ఫోంజో", అని పేరువచ్చింది. పిల్లరాజులైనప్పటికీ రాజభోగాలు వెళ్ళబోసిన మన జమీందారులు మామిడిపండు రుచిమరిగిన వారు కావడంవల్లనే పిఠాపురం, పెద్దాపురం, నూజివీడు, కార్వేటినగరం, బనగానపల్లి మామిడితోటలకు ప్రసిద్ధి కెక్కాయి. మన బైరాగి బ్రహ్మంగారి మెప్పుపొందక పోయినా మామిడిపండును ముస్లిం బైరాగులు మెచ్చుకున్న ట్టున్నారు. బహుశా వారు పసందుచేసిన మామిడిపండే "ఇమాం పసందు". మన బ్రహ్మంగారైనా మామిడిపండు మాధుర్యం తమాం తెలియనివారని త్రోసివెయ్యలేము. ఆయనగారి ఒక తత్త్వం "తియ్యని మామిడిపండు-పండు తినబోతే దొరకాదు - తీపులు మెండు" అని చాటు తున్నది. దీన్నిబట్టి పూర్వాశ్రమంలో ఆయన మామిడి పండు చవిచూచినవాడే; చిన్ననాడుచూచిన ఆ చవిని ఆశ్రమం ఫిరాయించిన తర్వాతకూడా మరవనేరకపోయిన వాడే. అయితే మెట్టవేదాంతం ముదిరిపోయినందున "తీపులు మెండు" అని, "తినబోతె దొరకాదు" అని చెప్పిన ఉత్తరక్షణంలోనే "పండుకు వృక్షము ప్రజ లెవ్వ

రెరుగారు పరమాత్ముడను యాకు పైనుండగా - పండు యెనుబదినాల్గు పర్వాములై యుండు - ఒరులాకు యీ పండు వశముగాకుండు'' అని బైరాగి ధోరణిలోకి దిగిపోయాడు.

రాజులను, మహారాజులనే కాక, విరాగులను కూడా రంజిల్ల జేసిన రసాల ఫలం ముమ్మాటికీ ఫలరాజం. ఒక్క సారైనా దాన్ని చవిచూడని బ్రతుకు బ్రతుకే కాదు. ఎంత పేరుగా బ్రతికితేనేమి? ఎందరిచేత నివ్వాళీ యెత్తించుకుంటే నేమి? — బెర్నార్డ్ షా బ్రతుకులో ఒక పెద్ద వెలితి మిగిలి పోయేదే. తొంభై దాటేవరకు ఆయన మామిడిపండు ముఖమైనా యెరగడు. ఆ లోపాన్ని తీర్చింది మన జవాహర్‌లాలే. మన ప్రధాని రెండేండ్లనాడు కామన్ వెల్త్ ప్రధానులసభకు లండన్ వెడుతూ ఇన్ని మామిడిపళ్లు ఉపాయనంగా పట్టుకువెళ్ళాడు. వాటిని తింటుండగా సెయింట్ జోన్‌ను ఊహించినప్పటికంటె, టానర్‌ను మననం చేసినప్పటికంటె, కెప్టెన్ బ్రాస్‌బ్రాండ్‌ను సృష్టించినప్పటి కంటె, లిజా మూర్తికల్పనను చేసినప్పటికంటె బెర్నార్డ్ షా ఎక్కువ తన్మయత్వాన్ని పొందివుండాలి!

మామిడిపండు స్వర్గానికి బెత్తెడు యెడంగా వుంటుందని తెలిసిన భాగ్యశాలికాబట్టే రాయలవారి తల్లికి స్వర్గానికి వేంచేయడానికి ముందు ఆ పండుపై మనస్సుపోయింది. విజయనగర సామ్రాజ్యాధిపతికైనా కాలంకాని కాలంలో మామిడిపండ్లను రప్పించడం సాధ్యమా? రాజమాత తన

మనసుతీరకుండానే దేహం చాలించింది. ఈ వెలితివల్ల ఆమె ఆత్మశాంతికి భంగంకలగవచ్చునని రాయలవారు మాతృశ్రీ శ్రాద్ధకర్మ సందర్భంలో భూసురోత్తముల సలహాపై వారికి బంగారు మామిడిపండ్లను పంచిపెట్టించారు. దానం పట్టడానికి వచ్చిన ప్రతి బడుగు బాపడు మిలమిలలాడుతున్న మేలిమి మామిడిపండు పుచ్చుకుపోవడాన్ని చూడగా తెనాలి రామలింగనికి కన్ను కుట్టింది; కడు పుబ్బింది. కు్ణాలమీద తన తల్లి తద్దినాన్ని కల్పించి, రాయలవారివద్ద దానాలు పట్టినవారినందరినీ కూకవేశాడు. "వాతరోగంతో తీసుకుని మా అమ్మ వాతలో, వాతలో అని గోలచేస్తూ హరీ అన్నది. ఈ తుదికోర్కె తీరకపోతే ఆమె ఆత్మ సంక్షోభపడిపోతుంది. తలొక వాత వడ్డించుకువెళ్ళండి" అని ఎర్రగా కాల్చిన కర్రుతో బెదిరించి బంగారపు మామిడిపండ్ల నన్నింటినీ వూడబెరుక్కున్నాడు.

అవి బంగారపు మామిడిపండ్లు కాక, బంగారాన్నిమించిన చిన్న రసాలైనా ఏదో పన్నుగడ పన్ని వాటిని తెనాలి రామలింగడు తన్నుకుపోయేవాడే. జహాంగీర్, హిమాయుద్దీన్, పంచదారకలశ, బెనీషా, బెంగుళూరియా, బంగినపల్లి, నీలం, రుమానీ, మల్‌గోవా, ఇమాంపసందు, సబ్జేసి, సువర్ణరేఖ, ఆల్ఫోంజో — ఇత్యాది పెద్ద పెద్ద పేర్లు ఇతర జాతుల మామిడిపండ్లకున్నా, పేరువింటేనే నోరూరించే పేర్లు వాటికున్నా, రసజ్ఞుడైనవానికి రసంమీద ఇవన్నీ దిగదుడుపు

కైనా పనికిరావు. అన్నంలో తోడుపెట్టిన గేదె పెరుగు వడ్డించుకుని, ఒక చిన్న రసాన్ని దానిలో పిండుకు తింటే స్వర్గసుఖాలుగా పుక్కిటిపురాణాలు చిత్రించేవన్నీ రసవిహీన మైనవిగానే తోస్తాయి. చిన్న రసం అంటే రసకుల్యా; కాదు, రసధుని; కాదు కాదు, రసార్ణవం.

అది చిన్న రసమైనా, మరొక మామిడిపండైనా దాని రుచి తెలిసేది తిన్నవారికే. తిననివారికి ఎంత చెప్పినా దాని మజా తెలియదు. ఎలాగైనా తెలియజెప్పాలని ఏదైనా ఉపాయం ఆలోచించినా ఫలితం అంతంతమాత్రమే. వెనకటికి పర్షియానుంచి మనదేశం వచ్చిన ఒక పెద్దమనిషి స్వదేశానికి తిరిగివెళ్ళి తమ షా దర్బార్‌లో మామిడిపండును మహ మెచ్చుకున్నాడుట. ఆ పొగడ్తను విని విని "సరే కాని, ఆ పండు రుచి మాకు ప్రదర్శించి చూపించగలవటయ్యా ?" అని షా అడిగాడట. వెంటనే ఏమీ తోచక "రేపటివరకు ప్రభువులవారు గడు విప్పించండి" అని భారత యాత్రికుడు మనవిచేసుకున్నాడట. నాటిరాత్రి అతడు దీర్ఘాలోచనలో మునిగి చిట్టచివరికి ఒక ఉపాయం కనిపెట్టాడట. మర్నాడు దర్బార్‌కు వెళ్ళి "ప్రభూ! ఇప్పటికీ దేవరవారికి మామిడి పండు రుచిని ప్రదర్శించి చూపలేను. కాని, వజీర్లలో ఎవరి కైనా చూపవలసిందిగా సెలవైతే ఈ గులాం తయ్యార్‌గా వున్నాడు" అని వినతిచేసుకున్నాడట. "భేష్ ! కానివ్వు" అని ప్రభువు సెలవయ్యేసరికి చింతపండు, పంచదార

తెప్పించి, ఆ రెండింటిని పల్చగా కలిపి, ఒక వజీర్ గడ్డానికి పట్టించి, మరొక వజీర్‌ను ఆ గడ్డాన్ని చీకమన్నాడుట. ఈ దృశ్యానికి విరగబడి నవ్వుతూ, "ఎలా వున్నది మామిడి పండు?" అని షా తన రెండవ వజీర్‌ను ప్రశ్నించగా అతడు తియ్యతియ్యగా, పుల్లపుల్లగా, పీచుపీచుగా వున్నది స్వామీ!" అని జవాబిచ్చాడట. "అదే, దేవరా! అచ్చంగా అదే మామిడిపండు రుచి" అని భారత యాత్రికుడు తన ప్రదర్శన విజయానికి పొంగిపోతూ అన్నాడట. కాని, మనం అదే మామిడిపండు రుచి అంటే ఛస్తే వొప్పుకుంటామా?







# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA117B132 |
| పుస్తకం పేరు | మాటామంతి |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 141 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | SOWMYA |
| పేజీలు విడదీసినది | SOWMYA |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |